చందా రు 1-0-0(పోస్టేజితో సహా) Reg. No. M. 3766

సంపుటము 32 సంచిక 8

# ఆంధ్రరాష్ట్ర ప్రారంభవిద్య

# Andhra Rastra Prarambha Vidya

(విద్యావిషయిక మాసపత్రిక)

నవంబరు 1943

సంపాదకులు:

శ్రీయుత మహావాది వేంకటరత్నముగారు, బి.ఏ.,



వ్యవస్థాపకులు:

శ్రీయుత ఈదర వెంకయ్యగారు,

ప్రొప్రయిటరు:

రామా అండ్ కో.,

హెడ్ఆఫీసు :— ఏలూరు,

బ్రాంచెస్:— గుంటూరు - రాజమండ్రి.

Printed by Mr Edara Venkaiah at his Pattabhirama Press, Ellore.

# విషయసూచిక

# ఆంధ్రరాష్ట్ర ప్రారంభవిద్య

**ANDHRA RASTRA PRARAMBHA VIDYA**

విద్యావిషయిక మాసపత్రిక

| సంపుటము 32 | ఏలూరు, 15 నవంబరు | సంచిక 8 |
| --- | --- | --- |



## నిత్యసంకీర్తనము

**వివరణము :**

ఆధ్యాత్మిక జీవితమున మనము పరించున దేమియు నుండదు చిత్తమును సరళముగను, నిర్మలముగను, ఉంచినంజాలును మనము పసిపిల్లలమై పోవలెను. భగవంతుఁడు అనంతుడు సర్వోపగతుఁడని యెఱింగి వినయవరతులమైనపుడు మనకా యనంతునిలోఁగల సంబంధము వ్యక్తమై ఆయనలోఁ గలసిపోవుదుము. మన యహంకారము, భౌతికవిషయాభిలాష మన ప్రాముఖ్యము అదృశ్యమై నిజమగు నానందము ననుభవింతుము

**సంకీర్తనము:**

1. హే అనంతమూర్తీ ! అతి వినయముతో నీ పాదముల నాశ్రయింతును
2 నీ వున్నచో సర్వము నాకు కరతలామలకము
3 నీవే నన్ను చేతిని బూని నడుపుచుండుము
4 నీయందే నాచిత్తము రమించుచు విశ్రమించునుగాక !

—స్వామి రామతీర్థ.

# భగవన్నుతి

కల్లూరు అహోబలరావు - పెనుగొండ.

సీ. అంతరాళంబెల్ల - నావరించిననిన్ను దేవాలయమున బంధించు టేల ?
పరిశుభ్రగాత్రుండై - వరలుచుండెడి నిన్ను జలకంబులాడించు - తలపులేల ?
ప్రకృతి సంపదలచే - రమణీయుఁడగునిన్ను శృంగారమును జేయు - చింతయేల ?
పరమసౌరభముచేఁ - బరిమళించెడినిన్ను చెలువుబుష్పములఁ బూజించుటేల ?
గీ. ఆకలిఁద్యజించియున్న నీ యాత్మకరయ షడ్రసోపేతభోజన సమితియేల ?
నిత్యపరిపూర్ణ ! దురితరాహిత్యహృదయ ! భక్తమందార ! నీకిదే - వందనంబు.

సీ. కోయిలకంఠానఁ - గోమలస్వరముల నింపుగాఁ గూర్చి కూయించినావు
నిర్ఝరంబుల మృదు - నిస్వనంబులనుంచి చిత్తమాహ్లాదింపఁ జేసినావు
వేదంబులను శ్రావ్యనాదంబుతో నింపి వీనులవిందు గావించినావు
వేణుస్వరంబులోఁ బ్రేమనాదముఁబోసి యంచితంబుగఁ బలికించినావు
గీ. నీకరుణలేక పల్కవాల్మీకిగాదు ఏకవులకేనిసాధ్యమే ! లోకమందు
నాకవిత్వాన మధురిమఁబ్రాకఁజేసి కైకొనుము నాదుహృదయంబు-లోకనాథ !

సీ. పున్నమజాబిల్లి - మురువుమర్మంబుల యంతరార్థంబు నొక్కింత దెలిసి
రిక్కల్మిణుకులో - నిక్కియాడెడి యాట వెలది యొయ్యారంపువిధమునరసి
క్కొక్కొరోకోయను - కోడికూతఁజెలంగు హెచ్చరికనినాద - ముచ్చరించి
చివురుజొంపాలలోఁ జెలువారుసౌహార్ద్ర తత్వసారము నింపుతమినిగ్రోలి
గీ. బాలపసిపాపముసినవ్వు - పసమెఱింగి విరులనెత్తావిసొంపు సంబరములరసి
నిన్నుఁజింతించువాఁడె సంపన్నుఁడరయ భక్తమందార ! నీకిదే - ప్రణుతిశతము.

---

ఓమ్.

# ముద్దుల భాగవతము

శ్రీ పటా. సూర్యనారాయణ కవి-బొబ్బిలి.

ఆ.వె. శ్రీరమేశ దాససేవ్య దయాకర । పద్మనాభ శౌరి వాసుదేవ;
విమల వేదవేద్య విశ్వాత్మ విశ్వేశ । వందనంబు గొనుము నందకృష్ణ. 1

శ్లో. షడ్గుణైశ్వర్య సంపన్నం । భగవన్మహిమాన్వితమ్
శ్రీమద్భాగవతం ప్రోక్తం । పురాణం మోక్షదాయకమ్.

తే. గీ. అద్భుతవిలాస దేవ ది వ్యావతార । భావనాతీత ముద్దుల భాగవతము;
కబ్బ మొసఁగించి నీకిదె కాను కిడితి । కృతిఁ గైకొని కృపనేలు కీర్తిసాంద్ర ! 2
తే.గీ. వరపురాణంబు శ్రీభాగవతము, దాని । యధిక మహిమనుఁదెల్ప నా యజునికైన
శక్యమె! యైన నాదగు శక్తికొలఁది । నీదుకరుణను వర్ణింతు నిర్మలాత్మ! 3
తే.గీ. శుద్ధసత్త్వమునందుఁ బ్రసిద్ధిఁగన్న । జీవులకు మేలొసంగు సచ్ఛీలి వగుచుఁ,
గాల చైతన్యయోగముల్ కలుగఁజేతు । వమల గుణభూష సువిశేష యార్యపోష!
తే.గీ. దేవకికిఁబుట్టి వ్రేపల్లెలో వసించి । పూతనాదుల సంహారమును నొనర్చి
తల్లిదండ్రుల కష్టములెల్లఁబాపి । విశ్వరూపముఁ జూపిన వెన్నుఁ డీవె. 5
తే.గీ. బలము తెలియక తొల్లి దేవప్రభుండు । తవిలి పెనుశిలావర్షంబు ధారచేయఁ
గొండఁ జిటికెన వ్రేలిపై గొడుగుఁజేసి । గోవులను గోపకుల నెల్లఁ బ్రోవలేదె? 6
తే.గీ. అల్ల చాణూర ముష్టిక మల్లమాళు । లాది కుజనుల బంధించి మోది చంపి
కరినిఁ గేసరి పట్టిన కరణిఁ గ్రూర । కంసుని వధించి విఖ్యాతిఁ గాంచలేదె? 7
తే. గీ. దుష్టకౌరవవర్గమున్ ధూళిజేసి । భక్తులౌ పాండుసుతుల భూపతులఁ జేసి
జ్ఞానమే దేవుఁడంచు నిశ్చయ మొనర్చి।యలరె నీకీర్తి లోక కల్యాణమూర్తి! 8
తే. గీ. జగము రక్షింప జీవులఁ జంపఁ బెంపఁ । గర్తవై కర్మసాక్షివై, కానుపింతు,
వెచట నీమాయఁ దెలియంగ నెవ్వఁ డోపు।యదుకులాంబుధిచంద్ర! బుధాగ్రగణ్య!
తే.గీ. లలితభక్తియు జ్ఞానవైరాగ్య తత్త్వ । విధులు పండ్రెండు ముక్తికి వెలయుచుండు;
నిగ్రహానుగ్రహవిధాన నిపుణుఁ డీవె । వినుతగుణశీల ! మాటలు వేయునేల ! 10
తే.గీ. క్షణికప్రాయము విషయ భోగంబటంచుఁ । బుండరీకాక్షు నిన్భక్తిఁ బూజచేయు
ఘనుల కుత్సాహసౌఖ్యముల్ గల్గునంచు।ప్రథమభాగములో వ్యక్త పఱుపఁబడియె.
తే.గీ. హరికి శేషంబు లీయాత్మలనియెఱింగి । నిన్ను సేవించునట్టి ప్రపన్నుఁడయిన
మనుజుఁడే ధన్యుఁడని పితామహుఁడు దెల్పె।భక్తి ముఖ్యము రెండవ భాగమందు.
తే.గీ. అన్య ఫలదేవతాచింత నాదు లుడిగి । చిన్మయాకార పరతంత్ర జీవనుఁడయి
సంచరించెడు వానికే జన్మసార్థ । కంబు దెల్పెఁ దృతీయభాగంబు నెగడు. 13
తే.గీ. ఆత్మతత్త్వాను సంధాన మంకురింప । తత్త్వమసి యాది వాక్యసిద్ధాంతసార
మెఱిఁగి తెలిపిరి దక్షాదు లెలమితోడ । నాలుగవదానిలో బుధా నందముగను. 14
తే.గీ. జపతపంబులు విధికృతుల్ సత్కథాళి । జనుల కవసర మనియెంచి యనవరతము
పాపసంగతు లరికట్టు పనులు బోధ । చేసి పంచమభాగంబు వాసిఁగనియె. 15
తే.గీ. స్వర్గ పాతాళ కాశ్యపీ వర్గములను । నతుల వైభవ రక్షణ లందిపొందు
దేవభక్తుల గరిమ స్వతంత్ర శక్తి । నమలపోషణ యాఱవ దై చెలంగె. 16
తే.గీ. కర్త భోక్తయుఁ బ్రేరక కారకుండఁ । గాను నే నని పూర్వసంస్కార మెఱిఁగి
నడుచు డేడవదానిలో నుడువఁబడియె నెల్లవిధముల మధురోక్తు లుల్లసిల్ల. 17
తే. గీ. పరమపురుషార్థ వర్గవిభాగములను । నతిరయమ్మున మన్వాదు లతికి యుంచి
రవియె సద్గుణజాలము లనఁగ బర్వె । లోక హితముగ నెనిమిది లో నటించె. 18

తే.గీ. ఇంగితజ్ఞాన మాత్మ నెఱింగియుండి । మెలఁగి బుద్ధీంద్రియక్రియల్ మేళగింప
శౌరి నిర్వ్యాజకరుణ చే కూరునదియ । ఘనత విలసిల్లె నవమభాగంబునందు. 19

తే.గీ. దుష్టనిగ్రహ మాపైని శిష్టరక్ష । ణంబు గావించు నీశాసనం బటంచు
మించి దశమంబులో నిరోధించి తెల్పు । రంజితగుణాఢ్య! కంజక రాధినాథ! 20

తే.గీ. అన్యథారూపమేదొ? యనన్యరూప । మేదొ? చేతనుఁ డద్దాని మీఁదెఱింగి
సేవ్యు నెడపక సేవించు చిత్తవృత్తి । నందు నేకాదశీస్కంధ మందు వెలసె. 21

తే.గీ. చిత్త మిగురొత్త భక్తి ప్రపత్తిచేత । పరమపురుషు నారాధించు వానికెల్ల
వైభవానందముల్ సదాప్రాప్తమంచు । కథితమయ్యెను ద్వాదశస్కంధమందు. 22

ఆ.వె. వాటమైన కపట నాటక సూత్రధా । రుండ వీవనుచు నెఱుంగ వశమె!
సర్వభూతములకు సాక్షివై వెలుఁగుచు । నెందు నెంద కుందు విందిరేశ! 23

తే.గీ. జ్ఞానకర్మాత్మ నిష్ఠనిస్సారమంచు । దుష్టవర్తన ఘనమని దోసిళులిడి
పాపవహ్నినిఁ బడియెడు వానికెల్లు । మేలు సమకూరుభవదాజ్ఞ మీఱువేళ. 24

తే.గీ. వసుధ మున్నెట్లొ యల్పజీవంబుదాల్చి । పెక్కుయోనులఁ బిమ్మటఁ జిక్కి పెఱిఁగి
వచ్చి నరజన్మ మెత్తి సద్వస్తువగుట । నీతి విడిచినఁ దజ్జన్మ రోఁతగాదె! 25

తే.గీ. జ్ఞానసారథిచేత నక్షంబు లనెఁడు । వారువంబులఁ దానాత్మ వశము జేసి
మనము నాఁబడు రథముతోలినయతండె । యుర్విలో ధీరుఁడైనట్టి యోగిసుమ్ము. 26

తే.గీ. కుటిలమతుఁ డాత్మనల్గుచుఁ గొంకులేక । కల్లతథ్యంబటంచును నల్లి పల్కు
దీన పశుతుల్యమా నడ పీనుఁగట్ల । జగతియందు జీవన్మృతుఁ డగుట నిజము. 27

తే.గీ. అల్పు లీర్ష్యను దుష్టకార్యములఁ జేసి । నిరయగతి చిక్కి చెడుటది నిశ్చయంబు;
అధికులో ధర్మకార్యము లాచరించి । నిత్యసత్కీర్తిపూజ్యులై నెగడు సుంద్రు. 28

సీ. అరయ నవ్యక్తంబు నవ్యాకృతము మాయ । మూఁడువిధంబుల మొనసియుండు
వస్తుమేళన గార్య వైచిత్ర్య దశయందు । మాయ నానోప్పారు మఱియు నదియె;
యైదుభూతంబులు నైదుతన్మాత్రలు దశవిధేంద్రియము లంతఃకరణము;
లెన్న నాలుఁగుగూడ నిర్వదినాల్గని రిది శరీరాదిక మింకమీఁద,
తే.గీ. నాత్మతత్త్వంబె యిరువది యైదవ దయి దాన భూతమై శేషత్వ ధర్మి యయ్యె;
నిరువదారువతత్త్వంబెయీశ్వరుఁడగు।నదియెపరతత్త్వమదియెబ్రహ్మంబునూవె.29

సీ. అఖిలాండకోటిబ్రహ్మాండముల్ కందుక క్రీడలవలెఁద్రిప్పు ప్రోడవీవె
ప్రకృతియుఁ బురుషులు వ్యక్తప్రపంచంబు । నర్తన మొనరించు కర్త వీవె
పూర్తిగ భువనముల్ బుట్టింప గిట్టింపఁ । భావింప లోకపావనుఁడ వీవె
ధర్మకామార్థాది సద్ధర్మముల్ శాసించు । రమ్యమౌ శ్రీపరబ్రహ్మ మీవె
తే.గీ. సత్త్వగుణమయు సారయశఃప్రభావ । శ్రీసమేతుఁడ వగుచు రక్షింపరావె?
దివిజ పరిపాలనోపేంద్ర దేవదేవ । భక్తజనలోల! మునిగణపాల! శీల! 30

ఫలశ్రుతి. (చిత్రవృత్తము)

కోమల యౌవన రక్తిన్ !
వేమఱు నీకృతి భక్తిన్ ! !
ప్రేమపరించు విరక్తిన్ ! ! !
కామిత మబ్బును ముక్తిన్ ! ! ! !

గద్యము.

పరమపురుషు కృపను బట్నాయ కాన్వయ క్షీరవార్ధిజాత శీత కరుఁడు;
సారగుణుడు సూర్యనారాయణుం డిట్లు । భక్తినీరు వ్రాసె - భాగవతము.

---

## దక్షిణఅమెరికా—ముఖ్యవిషయములు

(8 వ తరగతి విద్యార్థులకు గతసంచిక తరువాయి)

వేదుల నరసింహము, బూర్జ

| దేశములు. | ముఖ్యపట్టణములు. | వాని ప్రాముఖ్యము. |
|---|---|---|
| 1. బ్రెజీల్ | 1. మానాస్:— | ఈ పట్టణము అమెజాన్ నదిమీద నున్నది. ఇది రబ్బరు వర్తకమునకు ప్రసిద్ధి. ఇది సముద్రమునకు వెయ్యిమైళ్లు దూరములో నున్నను, అమెజాన్ నదిమీద స్టీమర్లు ఆ పట్టణమువరకు ప్రయాణము చేయును. |
| | 2. పారా:— | ఇది అమెజాన్ నదీముఖద్వారమున నున్న రేవుపట్టణము. పూర్వకాలమందు రబ్బరు ఎగుమతికి చాల ప్రసిద్ధిపొందినది. |
| | 3. రియోడిజనిరో:— | ఇది బ్రెజీలు దేశమునకు ముఖ్యపట్టణము. ప్రపంచములోనికెల్ల చక్కని రేవుపట్టణము. ఇచ్చటినుండి కాఫీ ఎగుమతి అగును. |
| | 4. సాంటాస్:— | ఇది బ్రెజీలు దేశములోని రేవు. ఇది ప్రపంచములో కాఫీ ఎగుమతికి పేరుపొందినది. |
| | 5. బాహియా:— | ఈ రేవునుండి కోకో విశేషముగ ఎగుమతి అగును. కాఫీ, చక్కెర, పొగాకు, ప్రత్తి కూడ ఎగుమతి అగుచుండును. |
| | 6. పర్నాంబుకో:— | ఇది బ్రెజీలులో నొక రేవుపట్టణము. ఇచ్చటి నుండి ప్రత్తి, చెఱకు, ఎగుమతి అగుచుండును. |

| దేశములు. | ముఖ్యపట్టణములు. | వాటిప్రాముఖ్యము. |
|---|---|---|
| 2. వెనిజులా | 7. బొలివార్:— | ఇది లానాస్ ప్రాంతపు వర్తకమునకు కేంద్ర స్థానము. ఇచ్చటినుండి మాంసము తోళ్లు అధికముగ ఎగుమతి యగును. |
| | 8. కారకాస్:— | ఇది వెనిజులాకు రాజధాని నగరము. ఇది సముద్రమట్టమునకు 3000 అ॥ఎత్తుననున్నది. ఇది చాల ఆరోగ్యవంతమైనది. మిక్కిలి అందమైనది. |
| | 9. లాగ్వాయిరా:— | వెనిజులా దేశపు రేవుపట్టణము. ఇచ్చట నుండి తోళ్లు, కాఫీ, కోకో, చెఱకు, ఎగుమతి చేయబడును. దీనికి సమీపమున కిరసనాయిలుగనులు గలవు. |
| 3. గయానాలు | 10. జార్జిటౌను:— | బ్రిటిషు గయానాకు ముఖ్యపట్టణము. |
| | 11. పారమారిబో:— | డచ్చి గయానాకు ముఖ్యపట్టణము. |
| | 12. కెయిన్:— | ఫ్రెంచి గయానాకు ముఖ్యపట్టణము. |
| 4. కొలంబియా | 13. బొగోటా:— | ఇది కొలంబియాకు రాజధానినగరము. |
| | 14. కార్తజీనా:— | ఇది కొలంబియాకు రేవు పట్టణము. |
| 5. ఈక్వెడారు | 15. క్విటో:— | ఇది ఈక్వెడారునకు ముఖ్యపట్టణము. ఇది భూమధ్యరేఖమీద నున్నను చాల ఎత్తుగా నుండుటచేత చల్లగనుండును. |
| | 16. గయాక్విల్:— | ఈక్వెడారు దేశపు రేవుపట్టణము. ప్రపంచములోని కోకో ఎగుమతిచేయు రేవులలో నిదియొకటి. |
| 6. పెరూ | 17. లీమా:— | పెరూ దేశపు రాజధానినగరము. |
| | 18. కెల్లావ్:— | పెరూ దేశపు రేవుపట్టణము. |
| 7. బొలివియా | 19. లాపాజ్:— | బొలివియా దేశపు రాజధాని నగరము. |
| 8. అర్జెంటీనా | 20. బ్యూ-ఎనోస్-ఐరిజ్:- | ఈ రేవులనుండి మాంసము, తోళ్లు, గోధుమపిండి ఎగుమతి అగును. |
| | 21. బాహియాబ్లాంకా | |
| 9. చిల్లీ దేశము | 22. ఇక్వీన్:— | ఇవి ఉత్తరచిల్లీలోని గొప్ప వర్తక స్థానములు. |
| | 23. ఆంటోఫాగస్టా | |
| | 24. వాల్పరైజో:— | ఇది మధ్య చిల్లీ దేశమునకు రేవుపట్టణము. గొప్ప వర్తకస్థానము. |
| | 25. సాంటియాగో:— | మధ్య చిల్లీ దేశమునకు ముఖ్యపట్టణము. ఇచ్చటి ప్రజలు మేధావంతులు. |

పిగ్మీలు:—ఆఫ్రికాఖండములో కాంగోనదీ అరణ్యప్రదేశముల చివరభాగములందు పిగ్మీలునివసింతురు. వీరు పొట్టిగనుందురు. స్థిరనివాసులుగారు. స్త్రీపురుషులకు సిగ్గులేదు. ఆకులు, చెట్ల పట్టలు, కట్టుకొందురు. అంబు, విల్లు, వీరి ఆయుధములు. వీరు మాంసాహారులు. వీరు చాపలు, బుట్టలు అల్లుదురు. కొయ్యపై నగిషీపని చేయుదురు.

మోయరీలు:—న్యూజీలాండు ద్వీపములోని ఆదిమనివాసులకు మోయరీలందురు. వీరు పొడవుగ, నల్లగనుందురు. వీరు ముఖమున పచ్చబొట్లు కలిగియుందురు. వీరికి ఆభరణములందు ఎక్కువప్రీతి. రాతితోను, ఎముకలతోను, ఆభరణములు చేయుదురు. ఇండ్లు అందముగనుండును. వేటయందు ప్రీతిఎక్కువ. నృత్యమునందు, గానమునందు వీరికి మిక్కిలి యిష్టము. నారతో బట్టలు నేయుదురు. కఱ్ఱమీద నగిషీపనులు చేయుదురు.

(సశేషము)

---

# యుద్ధానంతరం నూతన విద్యావిధానం

## భారతప్రభుత్వ విద్యాశాఖ అడ్వయిజర్ నివేదిక

### అవిద్యను రూపుమాపడానికి

### సాలీనా రు. 313 కోట్ల వ్యయంతో నిర్బంధ ప్రాథమికవిద్య.

న్యూఢిల్లీ, అక్టోబర్ 17—

మిస్టర్ సార్జెంట్, భారత ప్రభుత్వ విద్యాశాఖ సలహాదారు యుద్ధానంతర విద్యావిధాన పునర్నిర్మాణం సందర్భంలో ఒక మెమొరాండం తయారు చేసినారు. విద్యాశాఖ కేంద్రసలహా సంఘసభ్యులు ఈ మెమొరాండంపై ఢెరాడూన్‌లో అక్టోబర్ 13, 14, 15 తేదులలో జరిగిన ప్రత్యేక సమావేశంలో చర్చించి వున్నారు. భారతదేశంలోని బాలబాలికల కందరికీ ప్రాథమిక విద్యనేర్పడం, వారిలో వృద్ధికి వచ్చేవారికి పాఠశాలలోను, కళాశాలలోను, వాణిజ్య, సాంకేతిక, కళాసంస్థలలో విద్యనేర్పడం, మొదలగు పద్ధతులలో ఒక జాతీయ విద్యావిధానాన్ని ఈ మెమొరాండంలో సార్జెంట్ గారు సూచిస్తున్నారు.

విద్యావిషయమై బ్రిటన్‌లోను, ఇతర పాశ్చాత్య దేశాలలోను ఇదివరలో అక్కడి అధికారులు సాధించి ఏర్పరచ గలిగిన స్థితిని ఇండియాలో కూడా తీసుకురావడమే సార్జెంట్ గారి ముఖ్యోద్దేశం. యుద్ధానంతరం, కనీసం ఈపాటి పునర్నిర్మాణానికి ఇండియా పాటుపడాలనే సార్జెంట్ గారి అభిప్రాయం.

బ్రిటిష్ ఇండియాలో మాత్రం ఈ జాతీయ విద్యావిధానాన్ని అమలుపరచడానికి ఏడాదికి రు. 313 కోట్ల చొప్పున వ్యయపరుస్తూ అదేరీతిగా నలభై, లేక యాభైఏళ్లు పాటుపడవలసి వుంటుందట. ఈవార్షిక వ్యయం రు. 313 కోట్ల లోనూ రు. 277 కోట్ల వరకు ప్రజాసంస్థలే భరించవలసి వుంటుందట.

ఇండియాలో 1940-41 లో విద్యానిమిత్తం వ్యయం రు. 30 కోట్లు. దానిలో రు. 17½ కోట్లు ప్రజాసంస్థలు చెల్లించినవి. ఈ సంఖ్యలతో సార్జెంట్ గారు తలపెట్టిన జాతీయ విద్యావిధానానికి అయ్యే వ్యయాన్ని పోల్చి చూడవచ్చును.

బ్రిటిష్ ఇండియాలో సర్వత్రా ప్రాథమికవిద్యావిధానాన్ని అమలు జరపడానికి ఏడాదికి రు. 200

కోట్లు వ్యయ మౌతుందట. 520 లక్షల బాలబాలికలకు విద్య నేర్పడానికి 18 లక్షలమంది ఉపాధ్యాయులు కావలసివస్తారు. ప్రతి అయిదుగురు బాలురలోను ఒకడు హైస్కూలు చదువులో ప్రవేశించడానికి అర్హుడైవుంటాడని సార్జెంట్ గారి అభిప్రాయం.

సామర్థ్యం, బుద్ధికుశలతగల ఏ బీదబాలునికి చదువు నేర్పడానికి శక్తిలేక పోయిందనే లోటు లేకుండా చెయ్యడానికి సహాయవేతనాలు, స్టయిఫెండులు, ఉచితవసతి సౌకర్యాలు ఏర్పరచాలని సార్జెంట్ గారు సూచిస్తున్నారు.

ఈరీతిగా ఉన్నతపాఠశాలలలో జాతీయ విద్యావిధానాన్ని ప్రవేశపెట్టడం మూలంగా ఒకొక్క యూనివర్సిటీలో 240,000 విద్యార్థులకు చదువు నేర్పేఏర్పాట్లు వుండాలి. అనగా భారతీయ యూనివర్సిటీలు ప్రస్తుతం విద్య నేర్పుతున్న విద్యార్థులకన్న రెట్టింపు మందిని చేర్చుకోగల స్థితిలోవుండాలి. వివిధ యూనివర్సిటీలకు సమీకరణ కుదర్చడానికి ఒక భారతీయ యూనివర్సిటీ కమిషన్ ఏర్పడవలసివుంటుందట.

## క్రొత్తకళాశాలలు

ఇండియాలో విద్యావిధానానికి పట్టభద్రులు కాని ఉపాధ్యాయులు 20 లక్షలమంది హైస్కూళ్లలో విద్య నేర్పడానికి 180,000 పట్టభద్రులగు ఉపాధ్యాయులు కావలసివస్తారు. ఈ ఉపాధ్యాయులను తరిఫీదు చెయ్యడానికి కొత్త కళాశాలలు, కొత్త ట్రయినింగ్ స్కూళ్లు కొన్ని బయలుదేరాలి.

పాఠశాలలలోని బాలబాలికలు కేవలము వైద్య పరీక్షచేసి విడిచిపెట్టడకతో ప్రయోజనం లేదనీ, వారిలో లోపాలువున్నట్లు కనిపెట్టినప్పుడు అందుకు తగిన చికిత్స వెంటనేచేసి వారిఆరోగ్యాన్ని పెంపొందింపజేయాలనీ సార్జెంట్ గారు అభిప్రాయ పడుతున్నారు. 1941 లో విద్యాశాఖ ఆరోగ్యశాఖల సంయుక్తసలహా సంఘ నివేదికలోకూడా పైవిషయం సూచింపబడివున్నది.

పాఠశాలలలో పిల్లలకు మధ్యాహ్నంవేళ భోజన సదుపాయా లేర్పరచడం మూలంగా వారి శరీరారోగ్యాన్ని వృద్ధిచేయవచ్చును. పాఠశాలలలో పిల్లలకందరికీ వ్యాయామ శిక్షణఇవ్వాలి. ఇండియాలో బడికి వెళ్ళే బాలబాలికల వైద్యపరీక్ష నిమిత్తం 7,500 స్కూలుమెడికల్ ఆఫీసర్లు 1500 నర్సులు కావలసి వుంటారట.

## ప్రాథమిక, మాధ్యమిక విద్యావిధానాలు

ఆరేళ్లు మొదలు 14 ఏళ్ళమధ్య వయసుగల బాలబాలికలకు నిర్బంధ ప్రాథమిక, మాధ్యమిక విద్యలు, ఉచితంగా నేర్పాలని సార్జెంట్ గారు నొక్కి చెప్పుతున్నారు. కేంద్రవిద్యా సలహాసంఘ నివేదికలో సూచింపబడిన పద్ధతులలో వారికి విద్య నేర్పాలట. వార్ధా విద్యావిధానాన్నికూడా ఉపయోగించవచ్చునట. పిల్లలంతా తప్పకుండా ప్రాథమిక మాధ్యమిక విద్యల నభ్యసించవలసినదే. వారిలో వృద్ధిలోకి వచ్చేవారిని విద్యకై ఉన్నత హైస్కూళ్ళలోను ఇతర సంస్థలలోను చేర్చాలట.

ఉపాధ్యాయురాండ్ర సంఖ్యకూడా ఎంతనో పెరగవలసివుంటుందనీ, ఉపాధ్యాయులను నియమించడంలో దేశంఅంతట ఒక ప్రమాణపద్ధతిని అవలంబించాలని సార్జెంటుగారు తెలుపుతున్నారు.

పసిపిల్లలకు వినయ విధేయతలు క్రమశిక్షణ నేర్పే బాధ్యత ఉపాధ్యాయురాండ్ర మీదనే వుండాలి. ఇందుకై వారిని ప్రత్యేకంగా తరిఫీదు చెయ్యాలి ఇలాగ బడులలో ఉచితంగా పిల్లలను చేర్చుకోవాలట. పరిశుభ్రమైన నివాసాలులేని ప్రదేశాలలో, తల్లులు కూలీపనులకు వెళ్ళేవారుంటారు. అటువంటి వారిని తమ పిల్లలను ఇట్టిసంస్థలకు పంపవలసినదని ప్రోత్సహించాలట.

హైస్కూళ్లు రెండురకాలుగా వుండాలని సార్జెంట్ గారు అభిప్రాయపడుతున్నారు. సారస్వతాభివృద్ధికి తోడ్పడేవి, సాంకేతిక విద్యాకౌశలానికి తోడ్పడేవి అను ఈ రెండు రకాల పాఠశాలలలోను విద్యార్థులకు సర్వంకష జ్ఞానంకలిగేలాగ విద్య నేర్పాలట. ఈ విద్య, బాలురకు జీవనవృత్తికి తోడ్పడేదిగాఉండాలంటున్నారు. విద్యార్థులు వివిధవిషయాలు నేర్వాలి. విషయనిర్ణయం సందర్భంలో యూనివర్సిటీ ప్రయోజనాలను, పరీక్షలను దృష్టిలో ఉంచుకోకూడదని సార్జెంట్ గారు తెలుపుతున్నారు.

ఇండియాలో దాని వైశాల్యానికి తగినన్ని యూనివర్సిటీలు లేవనే సార్జెంట్ గారు అభిప్రాయపడుతున్నారు. ఇక్కడ హైస్కూలు విద్యార్థులకు యూనివర్సిటీ విద్యార్థులకు మధ్యగల నిష్పత్తి చాలా అధికంగా వున్నదట. అనగా విద్యావిధాన నిర్మాణములో హైస్కూళ్ళ విధానం ఇంకా బాగా వృద్ధి చెందక పూర్వమే యూనివర్సిటీ విద్యావిధానం వృద్ధి చెందియున్నది. అందువలన ఈ విద్యావిధాన నిర్మాణములో పునాదిదిట్టం తక్కువనె సార్జెంట్ గారు అనుకుంటున్నారు.

సార్జెంట్ గారు ఈ క్రింది సంస్కరణలను సూచి

స్తున్నారు, పట్టభద్రులకు మూడేళ్ళ విద్యావిధానం వుండాలి. అనగా ఇంటర్మీడియట్ విద్యను హైస్కూలు విద్యావిధానంలో చేర్చివెయ్యాలి. (ప్రస్తుతం ఢిల్లీలో ఈ పద్ధతి ప్రవేశపెట్టబడినది.) ట్యూటోరియల్ విధాన విస్తరీకరణ జరగాలి. ఉపాధ్యాయులకు శిష్యులకు సన్నిహిత సంబంధం ఏర్పడాలి. ఉపాధ్యాయవృత్తికి తగిన ఉపాధ్యాయులు ఉపాధ్యాయురాండ్రు లభించేలాగ, వారికి ఆ వృత్తి లోతగు ఆకర్షణ లేర్పరచాలి.

ప్రస్తుతం రాష్ట్రీయపద్ధతులలో విద్యార్థులకు టెక్నికల్ విద్యావిధానం ఏర్పరచడం ఎంతో కష్టం. కనక దీనికై ఒక అఖిలభారత సంస్థ ఏర్పడి అదే ఇట్టి సాంకేతిక విద్యావిధానంపై కంట్రోల్ అధికారాలు కలిగివుండాలి.

దీనికి మొదటిలో అయ్యేవ్యయాన్ని భారతప్రభుత్వంవారే భరించాలి యుద్ధానంతరం సాంకేతిక విద్యకెంతో ప్రాధాన్యం కలుగుతుంది. అప్పుడు వ్యవసాయ విద్యకుకూడా సాంకేతిక విద్యతో సమాన ప్రాధాన్యం ఏర్పడుతుంది.

డెరాడూన్‌లో విద్యాశాఖ కేంద్ర సలహా సంఘ సభ్యులు సమావేశమైనప్పుడు, వారు సార్జెంట్ గారి విధానాన్ని బలపరచినారు అంతర్విశ్వవిద్యాలయ సంఘంవారు కూడా ఈ విధానాన్ని గురించి ఆలోచించినమీదట, విద్యాశాఖ కేంద్రసలహా సంఘంవారు జనవరినెలలో బరోడా సమావేశంలో ఈ విధానాన్ని ఆమోదిస్తారు.

ఈ విద్యావిధానాన్ని అమలుజరిపే వ్యయాన్ని గురించి పత్రికావిలేఖరుల సమావేశంలో సార్జెంట్ గారు ఒక ప్రశ్నకు జవాబిస్తూ, ఇంగ్లాండులో జరిగినట్లుగానే ఇండియాలోకూడా ఇందుకై ఋణం చెయ్యవచ్చునన్నారు. ఇలాగ ఋణంచెయ్యడం చాల సబబైనపని అన్నారు. ఒక విధానాన్ని సూచించడమే గాని, దానికి సొమ్ము ఎక్కడనుండి లభిస్తుందన్న సమస్య తమకు అనవసరమన్నారు. దానికి తగిన ఏర్పాట్లను ప్రభుత్వంవారే చెయ్యాలన్నారు పునర్నిర్మాణ సంఘంవారి సూచనపై, విద్యా విధానం విషయంలో భారతదేశస్థితిని ఇతర దేశాలలోని స్థితికి తీసుకురావాలన్న వుద్దేశంతో తాము ఇట్టి విధానాన్ని ఏర్పరచినట్లు తెలిపినారు.

("ఆంధ్రప్రభ" నుండి)

---

## శబ్దము - వేగము

పి. నరసింహం. హెడ్‌మాస్టర్. తంగుడుబిల్లి.

కన్ను, చెవిముఖ్యమైన జ్ఞానేంద్రియములు. వీనివలన రూపము, శబ్దము గ్రహింపబడుచున్నవి. శబ్దము ఒక వస్తువు యొక్క కంపనమువలన కలుగుచున్నది. ఆకంపనము గాలినుండి మనకర్ణభేరి **(Ear drum)** ని చేరును. అప్పుడు మనకు శబ్దము వినబడును. భయంకరమగు శబ్దములు విని శరీరమును కాపాడుకొనుచున్నాము. మాటలను విని భావము గ్రహించుచున్నాము. పక్షుల తీయని పలుకులువిని ఆనందించుచున్నాము. అట్టి శబ్దమెట్లు పుట్టుచున్నది? పిల్లలు కొబ్బెరరేకు బూరచుట్టి, పీప అమర్చి ఊదినచో అది కంపించి ధ్వనిపుట్టును. తాటాకుతో తూనీగచేసి, గిరగిర త్రిప్పినచో ధ్వని వచ్చుట పిల్లలకు తెలియును. రింగుమను గాలిపడగ ఎగురునప్పుడు గాలికి మ్రోయుచుండ పిల్లలానందించుదురు. తుమ్మెద ఒక పువ్వునుండి యింకొక పువ్వుమీద వ్రాలుటకు ఎగురునప్పుడు ఝుంకారము పుట్టును. వీని కన్నింటికిని కంపనము కారణము. అనగా శబ్దము కంపనము వలననే కలుగుచున్నది. గొంతులో గాలి గొట్టముపై స్వరపేటికగలదు. దీనిలో రెండు స్వరతంతువులుగలవు. మాట్లాడునపుడు ఇవి దగ్గఱకువచ్చును. అప్పుడు గాలి వీని

మధ్యగుండ బయటకు పోవుటచే ఇవి ప్రకంపించి ధ్వనిని కలుగజేయును.

ధ్వనిని గాలియేగాక నీరును, భూమియు వ్యాపింపజేయును. నేలపై చెవినాని దూరమున కలుగు శబ్దమును వినవచ్చును. ఒక చెరువులో దూరముగా ఇద్దఱుమునిగి, అందులో నొకడేదైన ధ్వనిచేసిన రెండవ వానికి వినఁబడును. జలచరములు శబ్దములను నీటివలననే తెలిసికొని సంచరించుచున్నవి. ఒక వంతెన వద్దకుబోయి, దాని ప్రక్కనుండు ఇనుప ఊచల రెండు చివరలను ఇద్దరుండి, ఒకడు ఒక చివరను సూదితో గీచిన ఆచిన్నధ్వని రెండవ కొనకు వినబడును. ఒక పొడుగు దూలము రెండు చివరల నిద్దరు నిలువబడి యొకడొకవైపు చివరను గుండుసూదితో గీచిన యెడల రెండవచివరనున్న వానికాశబ్దము స్పష్టముగావినబడును. గాజుపలకల తలుపునకు ఆవలయొకడును, ఈవల నొకడును ఉండి మాట్లాడినచో ఒకనిమాటలు ఒకనికి వినబడవు. గాజులోనుండిశబ్దముపోజాలదు అనగా శబ్దవ్యాప్తికి పదార్థమావశ్యము. నీరు, గాలి, లోహములు ఇవి శబ్దవాహకములు. గాజు శబ్దవాహకమునకు నిరోధము.

ఇట్లు కంపనము, దానివలన కలుగు శబ్దము, ఒక అణువునుండి మఱియొకదానికిపోయి, మనచెవియొద్దకు వచ్చుటకు కాలవ్యవధి ఏమైనయగునా? ధ్వనిపుట్టిన చోటునుండి మన చెవులవరకు వచ్చుటకు కొంతకాలము పట్టును. మన మెప్పుడైన చాకిరేవులోనికి బోయి చాకలి వాండ్రు బట్టలు ఉతుకుట కొంచెము దూరము నుండి చూచిన నీసంగతి తెలియగలదు. చాకలివాడు బట్టను రాతిమీద కొట్టునపుడు శబ్దము వినిపించదు. వాడుబట్టను పైకి తీయునపుడు వినిపించును.

ఇట్లేతుపాకిని కాల్చినపుడు ముందుగా మంటయగుపడి తర్వాతధ్వని వినబడును. గొడ్డటితో ఒకచెట్టును నఱుకనప్పుడుగాని, సమ్మెటతో దేనినైన సాగగొట్టునప్పుడుగాని, మనము అక్కడనే యున్నయెడల వానిధ్వని మనకప్పుడే వినబడును. అయిన మనము దూరముననుంటిమేని, అట్లు నఱుకుట, సాగగొట్టుట, మనకుగనబడినపిమ్మట కొంతసేపైన తరువాతఁగాని వాని ధ్వని వినబడదు.

ఇవ్విధముననే మెఱుపును, ఉరుమును, ఏకకాలమందే పుట్టినవైనను మనకు మెఱుపుకనబడ్డ పిమ్మట కొంతసేపయిన తరువాతగాని ఉరుమువినబడదు. మెఱుమును గలుగజేయు మబ్బు మనకు ఎంత దూరముననుండునో ఉరుము వినబడుటకు అంత కాలవ్యవధి అవునుగాన, మనకు మెఱుము కనబడుటకును, ఉరుము వినబడుటకును, నడుమనుండు కాలమునుబట్టి ఆమబ్బు మన కెంతదూరముననున్నదో, కనుగొనవచ్చును. మెఱుము అత్యధిక దూరమున బుట్టినయెడల ఉరుము మనకు ఎప్పటికిని వినబడకయే పోవచ్చును. 200 మైళ్లకు మించకుండ ఎంతదూరమున బుట్టిన మెఱుమైనను మనకుఁగనఁబడును గాని 30 మైళ్లకంటె నధిక దూరమున బుట్టిన యురుము మనకు వినబడదు. వీనినిబట్టి శబ్దము ఒకచోటునుండి మఱియొకచోటికి పోవుటకు కొంతకాలముపట్టునని తెలియుచున్నది. అది యెంతవేగముతో బోవునో కనుగొందము.

రెండుచోటులుచూచి యిద్దరు మను

జులు తుపాకు లొక్కసారి పైకికాల్చిరి. ఆధ్వనియిచ్చుటకును ఈధ్వనిఅచ్చుటకును, వెళ్లినవి. దూరమెంతయున్నదో చూచి, కాలమెంతపట్టినదో చూచి పెద్దగాలి లేనప్పుడు సెకండునకు 1100 అడుగులవేగము వంతున వేగమున్నదని కనుగొనిరి. కొంత దూరమున తుపాకిపైకాల్చి మంటకనబడుట కును, శబ్దము వినబడుటకును, మధ్యకాలము జాగ్రత్తగా కనుగొనిన ఆకాలమాధ్వని యంత దూరము పోవుటకు కావలసిన కాలమైయుండును. దానినిబట్టి 1 సెకండులో నెంతదూరము పోవునో తెలియును 10 సెకండులలో 11000 అడుగుల దూరమున బుట్టిన శబ్దము వినబడునని తెలిసికొనిన, సెకండునకు 1100 అడుగులు పోగదలని వెంటనే తెలియగలదు. అదియేధ్వనివేగము. ప్రతిధ్వనినిబట్టి గూడ దూరమును తెలిసికొనవచ్చును.

బయలు ప్రదేశమునబోవుచు, చేతులు తట్టుటగాని, మఱియేధ్వనినిగాని చేసిన, మనకు తిరిగి యొకధ్వనివినబడును. ఆధ్వని మనముచేసిన ధ్వనివలెనే యుండును. ఇట్టిది మనము కొన్ని యిండ్లముందు, పెద్దగోడలు గలచోట ముఖ్యముగా కొండలుగలచోట, సాధారణముగా వినుచున్నాము మనము చేసిన ధ్వనియేతిరిగి రెండవమారు మనకు వినబడుచున్నది. ఇది మనముచేసిన ధ్వనికి ప్రతిగానుండుటచే 'ప్రతిధ్వని' యనబడును.

ఒక శబ్దమునుచేసి దాని ప్రతిధ్వని తర్వాత ఎన్నిసెకండులకు వినబడునో జాగ్రత్తగా కనుగొనవలెను. 10 సెకెండు లలో వినబడినదనుకొనిన 10 సెకండులలో శబ్దము ఎంతదూరము పోగలదు? 10 × 1100 11000. అడుగులు పోగలదు. ఆశబ్దము మన యొద్దనుండిబయలుదేరుటచే మన యొద్దనుండి కొండవఱకుపోయి తిరిగి మనవద్దకువచ్చు వరకుగల దూరము 11000 పదునొకండువేల అడుగులు అనగా మన కును కొండకునుగల దూరము అది రెండు సారులు ప్రయాణము చేయవలసివచ్చెను. కాబట్టి మనకును కొండకునుగల దూరము అది ప్రయాణముచేసిన దూరములో సగమైయుండును. అనగా 5500 అడుగులు. ఇట్లు ప్రతిధ్వనినిబట్టి దూరమును కనుగొనవచ్చును. శబ్దవేగము మనకు తెలియని యెడల దూరమును కనుగొనుటకు వీలు లేదు. అయిన దూరము మనకు తెలిసిన, వేగమును కనుగొనవచ్చును.

శబ్దము ద్రవపదార్థములయందు, గాలి యందుకంటె 4 రెట్లవేగముతోను సెకండునకు 5000 అడుగులు ఘనపదార్థముల యందు 10 రెట్లవేగముతోను (ఉక్కులో సెకండునకు 16000 అడుగులు) బోవును. ధ్వనిగాలిలో సెకండునకు 1100 అడుగుల దూరము ప్రయాణము చేయగలదు. ప్రకాశము సెకండునకు, 1,80,000 మైళ్లు ప్రయాణముచేయును. ధ్వనికంటె వెలుతురు 9 లక్షలరెట్లు ఎక్కువ శీఘ్రముగా బోవును. అనగా ధ్వనియొక్క వేగము ప్రకాశవేగముకన్న చాలతక్కువ. ఇట్లు శబ్దముయొక్క వేగమును తెలిసికొనిన లాభమేమి? ప్రస్తుతయుద్ధమందిదెట్లుపకరించును?

(వచ్చే నెల సంచికలో)

పద్యనీతికథావళి _ రెండవకథ

## సింహము - చిట్టెలుక

బాలకవిశేఖర, వాకాటిపెంచలరెడ్డి

ఆ. ఒక్కనాఁడు సింహ - మొక్కటిగుహలోన । నిదురవోవ నెలుక - కొదమయొకటి
దానిమేనిమీఁదఁ - దద్దయువేడ్కతోఁ । బరువులెత్తసాగె - భయములేక.. ౧

ఆ. సింహమంత లేచి - చీల్చఁగానుంకింపఁ । బ్రాణభీతితోడఁ బ్రణుతితోడ
నుడివెమూషికంబు - వడకు నెలుంగుతో! మెకముఱేడ! నన్ను - మ్రింగవలదు. ౨

ఆ. చిన్నజంతువనుచు - నన్నుఁజంపుదురేమొ । యెప్పుడైనఁదమకు - ముప్పుగలుగ
నేన సాయపడుదు నిజమింత చెప్పితి । మాటనమ్మినన్ను - మనుపుమయ్య. ౩

ఆ. అనుచు నెలుక వేడ - హర్యక్షమప్పుడు । "అల్పజంతువిద్ది - యాపదయిన
సాయమేమినాఁడఁ - జేయునో మఱిచూత" । మనుచువిడిచిపుచ్చె-నరిగెయెలుక. ౪

ఆ. మృగయుడొకఁడువచ్చి-మృగరాజుగుహచెంతనురులుపన్నియుండ-నెలుకమాలి
సింహమురులలోనఁ - జిక్కిమిక్కిలిభీతిఁ గడలు మ్రోయఁజేసె - గర్జనంబు. ౫

ఆ. సింహగర్జనంబు - చెవిసోకినంతనే । పరుగుమీఁదినటకు - వచ్చె నెలుక;
కొఱికెనురులవాడి - కోఱల; మృగపతి । ముప్పుఁబాపె; మున్ను - చెప్పినట్లు. ౬

ఆ. అల్పుఁడనుచునొకని - నవమానపఱచుట । నీతిగాదు మేలు - నేతగాదు,
అరయసింహమునకు-నల్పమూషిక మొండు। సాయపడదె! కష్ట-సమయమందు. ౭

---

## మౌనపఠనము

శ్రీ తాతా సత్యనారాయణ,

సెక్రిటరీ-టీచర్సు అసోసియేషను-సీతానగరం

మౌనపఠనము మన విద్యాలయములలోని పాఠ్యవిషయముగ నెంచబడుచున్నది. నామమునుబట్టియే దీనిని మన ప్రణాళికలోని "వాచక" విషయమునఁజేరిన దానిగ నెంచదగును, నిజముగనిది భాషాబోధన పద్ధతులలోని విధాన విశేషమే యన నొప్పును. అయినను, శబ్దార్థమునుబట్టి, బాలుర నీపాఠ్యవిషయమున, నిరంతరము నిశ్చల, నిశ్శబ్ద, నిబిడీకృతులుగ నుంచదలచుట విపరీతమే యగును. బాలురు సహజముగఁ జంచలస్వభావులును, నెడతెగక తమ మనముల, శ్రద్ధ ఉత్సాహములను నొక విషయమున కేంద్రీకరించి, నిలిపి యుండజాలరనుట ప్రసిద్ధము కనుక మౌనపఠనమునకు, సామాన్యపాఠ

ములకంటెఁ జాల కొలఁదికాలమును వినియోగించుటయే క్రమమును, వర్ణక్రమజ్ఞానమున నారితేరి, వేగముగను, ధారాళముగనుఁ జదువసమర్థులగు పైతరగతుల విద్యార్థులకుఁ, దగిన సాధకమునునై యొప్పును.

పైగ్గరగ చదువబడు వాచకపాఠములోనివలెనే విద్యార్థుల మనముల, నాయా యంశములపైకి దొలుతను, పటుపిమ్మట నాయంశముల వెలువరించు భాషాప్రయోగ ములపైకిని, మనము మఱలింపవలెను. ఇట్టి మనయుద్దేశము సమగ్రముగ నెరవేరవలె ననిన, నిందులకు నియమితమగు "వాచకము"పై నెంతయో నాధారపడియుండును. పిల్లల తరగతికి తగిన భాషయును, కఠినపదముల సంఖ్యయును, మిగుల స్వల్పముగను నుండి, వారలు సులభముగ భావముల గ్రహింపదగినదిగ నుండవలెను. సామాన్య తరగతి వాచకములకన్న నాతరగతి యుపవాచకము లీమౌనపఠనమునకు దగ్గియున్నవి. ఒక్కొక్కప్పుడు అంశము మాత్రము ప్రధానముగ దలంచబడు, భూగోళచరిత్రాది యితర పాఠపుస్తకములును, నీమౌనపఠనమునఁ బ్రయోగింపదగును.

మౌనపఠనము, వాచక పాఠ్యబోధనాపద్ధతుల విశేషమే యగుటచే నుపాధ్యా యుడు ప్రయోగమున గొన్ని విశేషాంశములు గుర్తులోనుంచుకొన వచ్చును. ప్రదర్శ నాంశము బాలుర నుత్సాహపఱచు నదిగనుండి, వారలకు నూతనమైనదిగనుండవలెను. మాదిరి వాచకము నుపాధ్యాయుడు చదువు టంతయవసరముకాదు, కాని యొకప్పుడు, వాచక సౌలభ్యమునకును, అభిప్రాయముచ్చారణ భేదమున క్రమప్రకటన యగునట్లును పాఠ్యాంశమునకు బూర్వగాథ యున్నచో నది చదివి బాలురలో నుత్సాహము నుద్దీపింపఁజేయవచ్చును. ప్రదర్శనాంశములు సామాన్యముగ నొకటి రెండు "పేరా" లు చాలును, అనగా నొకటి రెండు ప్రధానాంశములు మాత్రముండునటుల జూడ వలెను. ఇట్లు అంశములను మౌనపఠనమునకు, నొకటి వెంబడి నొకటి ప్రయోగించి బోధింపవచ్చును. విద్యార్థులు తాము చదివిన భాగముల గల ముఖ్యాంశముల సేక రించి (Taking down notes) యుంచునటుల జేయవచ్చును. వారలు చదివిన యంశ ములనుండి, పల్లబల్లపైని వ్రాయబడిన ప్రశ్నముల కుత్తరముల లిఖింపజేయవచ్చును. ఒకటి వెంబడి యొకటి పేరాలయొక్క యంశమును, మౌనపఠనాంతమునఁ బ్రశ్నించి, రాబట్టవచ్చును. పిల్లలు చపలత్వమున నలసత నొందకుండునట్లును, వ్యర్థముగ గాల హరణ మొనర్పకుండునట్లును, న్యాయమగు నియమితకాలమున, మౌనపఠనమును ముగించునట్లు, చూచుచుండవలెను. అంశమును రాబట్టిన పిదప, నుపాధ్యాయుడు సంద ర్భాను సారముగ నాయంశమును గ్రోడీకరించి చెప్పుచు, నందందు గల కఠినపదముల వైపునకును, పదజాలప్రయోగము వైపునకును, బిడ్డల దృష్టి నాకర్షింపవలెను. ఆయా పదములను, పదజాలములను, వాక్యములలో బ్రయోగింప జేయవచ్చును. వ్యాకర ణాంశములకుగూడ నిందు అవకాశమిచ్చి మొదటి యుద్దేశమును సంకుచితము సేయ వాంఛనీయముగాదు పురాణగాథల ప్రశంసయున్నచో నాయంశములగూర్చి, మూల గ్రంథముల పరిచయమునకు బిల్లల ప్రోత్సహించవలెను. పిల్లలకు ప్రత్యేకప్రశ్నాపత్ర

ములనిచ్చి, సంజ్ఞామాత్రముగ జవాబుల గుర్తింపించుటకూడ పిల్లలకు క్రీడావిధి నుత్సాహపఱచును. ఈపత్రములు (test cards) భిన్నభిన్న ప్రశ్నములు గలవిగనుండవలెను. ఈ పాఠ్యబోధానాంతమున బిల్లల నాయా పాఠ్యాంశముల నిర్ణీతపంక్తులలో వ్రాయ గోరవచ్చును. పెద్దపాఠ్యభాగమును సంగ్రహముగ వ్రాయనలవఱచవచ్చును.

ఈ మౌనపఠన కార్యక్రమము బిడ్డలకు ననేకప్రయోజనముల సమకూర్చునదిగ నున్నది. బిగ్గరగ చదువుటలో గలుగు నాయాసమిందు శ్వాసక్లేశమునకు గలుగ జాలదు; పైకి జదువుటలో దఱచుగ పదముల యర్థమునుండి పదముల యుచ్చారణ ధ్వనులు, మనసు నేకాగ్రతనుండి తప్పించుటగలదు, గాని యిందీ దోషమునకు దావు లేదు. కండ్లుమాత్రము విశేషించి పనిచేయునుగాన, నధికమగు శ్రద్ధయును, నెక్కుడగు భావగ్రహణమును, విద్యార్థులు చేయగలరు. అభ్యాసవశమున బిడ్డలు క్రమముగ గ్రంథపఠనమునకు గుతూహలులుగ మాఱి, యొంటరిగ నున్నను పఠనమున సుఖసంతసముల నొందజాలుదురు. ఈ యభ్యాసమే మనుజుని నిశ్చలునిగను, కార్యనిమగ్నునిగను, జేయును. మౌనపఠన మితరులకెట్టి యభ్యంతరముల గలుగజేయక, పఠితుని నెంతయు పఠితునిగగాక, లేఖకునిగమార్చి, యతనిని భావప్రకటనమున, నుచితజ్ఞునిగను, వ్యర్థపద, వాక్య, ప్రయోగశూన్యునిగను, జేయుననుట యతిశయోక్తిగాదు, తొందరపాటున తప్పునిర్ణయముల గావించు దోషమును నాతనియెడ గానరాదు.

మౌనపఠనమిట్లు మన విద్యాలయముల జ్ఞానసంగ్రహణమునకు మిగుల దోడ్పడుటయేగాక, యితర విధములకన్న నందులకగు కాలపరిమాణమును హ్రస్వపఱచును. ఒక్క భాషా విషయిక పాఠములనేగాక యించుమించుగ నితర విషయములగూడ నిది యత్యంతము సహాయకారికాగలదు. అందును, మన విద్యాలయములలోని పైతరగతుల వారలకీ విధానమున ప్రవేశము గలిగించుట మిగుల ప్రయోజనకారియగును. మిగుల పిన్నవయస్కులతోడ నిండియుండు ప్రారంభ తరగతులలో, నీమౌనపఠన ప్రయోజనము వారల క్రమవర్తనులుగ జేయసహాయపడునని యూహింపవచ్చును.

---

# స్కూలు మేనేజిమెంటునందు కొన్ని నూతన పద్ధతులు

స్కూలులో మనము నిర్వహించుచున్న రికార్డులన్నియు, ఇన్‌స్పెక్టింగు ఆఫీసరు సౌకర్యార్థము ఏర్పాటుచేయబడ్డవి. ఆఫీసరు స్కూలువిజిట్టు చేయుసరికి స్కూలు పరిస్థితులన్నియు, స్కూలు సక్రమపద్ధతులపై బరుగుచున్నది లేనిది, విద్యాభివృద్ధి ఎట్లున్నది, అన్నితరగతులలోను చదువు సమానముగా చెప్పబడుచున్నది, లేనిది, యిత్యాది విషయములు అరగంటలోపుగనే ఆఫీసరునకు తెలియుచున్నవి.

మన మేనేజర్ల సౌకర్యార్థము కూడ మేనేజిమెంటు సక్రమపద్ధతులపై జరుపుకొనుటకు కొన్ని నూతన పద్ధతులు అవసరమైయున్నవి. అట్టి వానిలో మొదటిది.

## 1. Permission Slip.

JAYALAKSHMI HINDU Ele SCHOOL,

GOVERNORPET, BEZWADA.

1. Name of teacher or pupil
2. Date
3. Duration From . to...... .. .. A. M / P M.
4. Causes
5. Teacher's or Pupil's signature
6. Manager's or Head-Master's remarks

Manager or Head-master.

ఎట్లయినను టీచరు మేనేజరుయొక్క పర్మిషన్ కావలసినప్పుడు వ్రాతమూలమున మేనేజరునకు వ్రాసి యివ్వక తప్పకన్నది. అందుకుగాను కాలహరణములేకండ బహుతేలికగ ఈ నమూనా పర్మిషన్ స్లిప్పును పూర్తిచేసి మేనేజరు అనుమతి పొందవచ్చును.

## 2. Application for Leave

JAYALAKSHMI H. E. SCHOOL, Governorpet, BEZWADA.

1. Name & Designation of the teacher.
2. Nature of leave with causes.
3. No. of days with dates
4. No. of days Previously used. Casual sick Privilege or other leave
5. Signature of the teacher .
6. Manager's or Head-master's remarks.

Date Manager or Headmaster.

ఈ నమూనా ఫారములు మేనేజరు తన స్వాధీనములో నుంచుకొని అవసరమైనప్పుడు టీచర్లకు ఇచ్చి, పూర్తిచేయిందుకొని, సెలవుదరఖాస్తుచేసి యిచ్చిన బాగుండును. ఈ ఫారములో ఎప్పటికప్పుడు టీచరు పూర్వము తాను ఆక్యాలెండరు సంవత్సరములో ఎన్ని అటువంటి శలవులు వాడుకొన్నది, వాటివివరణ పూర్తిగా తెలుస్తుంది. ఇటువంటి పారములు ఉపయోగించిన యూనిఫారముగా సెలవుదరఖాస్తులుండును. సెలవు పెట్టుకొనుటకు ఎక్కువ కాలహరణముండదు. కాగితముకొరకు ఇంటివద్దగాని, స్కూలులోగాని, పిల్లలను పడిపించి వారి పుస్తకములలో చింపనవసరముండదు. ఇట్టి సంబంధమైన ఫారములు మేనేజరు అట్టేపెట్టుకొంటే స్కూలు నిర్వహణము చక్కగా పేరు ప్రతిష్ఠలతో నుండును.

ఇట్లు

CH. LAKSHMI NARAYANA,
Teacher-manager,
Jayalakshmi H.E. School, Bezwada.

# కొండవీడు

బాలకవి అన్నాప్రగడ వీరరాఘవయ్య.

సీ. రెడ్డిరాజుల శౌర్యరీతులఁ బ్రకటించు, నాటకావళికి రత్నాలశాల,
కవిసార్వభౌము వాక్చాతుర్యభూమిని, తొలిపంట పండించు దోహదంబు,
సుందరతరులతా సుమనసః పరిఫుల్ల, నందిత భూలోక నందనమ్ము,
భారతజనయిత్రి ప్రాచీనవైభవఁ కళలువాసించు బంగారునేల
తే. గీ. అత్తరులఁ, గాగితములఁ దయారుచేసి । పిలిచి పేర్గన్న హైందవ విపణివీధి
హంపినగరికి నీడుజోడైన నెలవుఁ । గొంకుకలనైన నెఱుఁగ దీకొండవీడు. 1
సీ. ఇదెకదా? పతిరాక నెదఁగోరె రుక్మిణి, ఆర్య నారాధించినట్టి చోటు
ఇదెకదా? విభువరియించుచో దమయంతి, పరికించి గెల్చుసంభ్రమపుఁదావు
ఇదెకదా ? ఆశుకవీశుఁడౌ వేమన్నఁ, గడుపారగన్న విఖ్యాతసీమ
ఇదెకదా? గర్వాన నెకదొట్టుజెనుల, పరువుఁ గూర్చినకీర్తి భరితతలము
తే.గీ. ఇదెకదా? మాయమర్మము లెఱుఁగనట్టి! వెడఁగుగొల్లఁడు యతినిఁజంపిన పొలంబు
ముదిమిచే బక్కచిక్కిన ముసలితాత । కతలగేములను లోగొన్న గఱువమిన్న. 2
ఉ. పాలనఁజేసినారు పరిపాలకులై నుతిగొంచు కావ్యసు
శ్రీలలనానురక్తిని వరిష్ఠకవీంద్రుల సత్కరించియున్;
లాలనసల్పి పండిత కులంబు నుదారత జెంగలింపగా
మేలనిపించు సద్యశ మమేయముగాఁ గనినారు భూపతుల్. 3
తే. గీ. ప్రథితుకా రెడ్డి రాజులపాలనమున। బాల్యమునువీడి యౌవనావస్థనొంది
ప్రేమచేఁ గృష్ణరాయ భూవిభునిఁజేరె । మతిచెడిన కొండవీటి సామ్రాజ్యకాంత. 4
ఉ. కత్తులబావిలోపల విగాహనమైనది పాళెగాండ్ర రే
కెత్తిన పౌరుషంబు, దళుకీను నిశాత కృపాణధార గ్రొ
న్నెత్తురు వెల్కిఁజిందె, ధరణీవలయంపు విషాదగీతితో
హత్తుకొనంగఁబోయె నహహా! ఇది స్వప్నకథావిశేషమై. 5
తే.గీ. మంచమును పట్టి శల్యమై మ్రగ్గిమ్రగ్గి। యస్తమించిన యొక పండుటవ్వవోలె
భిన్నమై ఛిన్నమై కొండవీటిసీమ। లీనమైపోయె కాలగర్భానఁదుదకు. 6

---

## చరిత్ర - దానిని బోధించు పద్ధతి

బాలకవి ఏ. వి. రాఘవయ్య, టీచర్ - యు. యల్. సి. ఘుమ్. గరల్సు స్కూలు, నరసారావుపేట.

చరిత్ర—ఉత్సాహజనకమగు విషయము — విద్యార్థుల కుత్సాహము నిచ్చును. కాని ప్రాథమిక పాఠశాలా ప్రణాళికలోని దీనిని బోధించు నుపాధ్యాయుడు మంచి యన్ని విషయములలో చరిత్ర పాఠము కథకుడై యుండవలయును. అతడు సరళ

మగు భాషచేతను, వాక్చాతుర్యము చేతను, చక్కని కథలను జెప్పియు అవసర మగుచో నభినయ నృత్యముల గూడ జూపుచు, నతడు ప్రప్రథమము నుండియే విద్యార్థుల మనముల రంజింప జేయవలయును. ఇట్లుచేసి చరిత్రయందు వారి సహజోత్సాహశక్తుల నాతడినుమడింప జేయవలయును. సదరు చారిత్రిక విషయమున వారి యవధానాసక్తులు చెదరకుండ జూడవలయును.

చరిత్ర బోధన ఉద్దేశములు —

సాధారణముగా చరిత్ర బోధనలో నాలుగు ముఖ్యోద్దేశములు గలవు అవి యేవన :

(1) విద్యార్థుల యనుకరణ శక్తిని వృద్ధిజేయుట. మహాపురుషుల యాదర్శ జీవితముల నర్థము జేసికొని వారివలె మహత్తర గుణముల నలవరచుకొన నేర్పుట..

(2) ప్రాచీన, ఆధునిక చరిత్రలకు భేదము నిరూపింపజేసి వాని పరిణామములను గుర్తింపజేయుట.

(3) చరిత్ర నాగరికతకు ప్రథమ సోపానము పౌరాణికాధునిక నాగరికతల విద్యార్థుల కాదర్శప్రాయములుగ నొనర్చుట.

(4) బాల బాలికలయందు వీరత్వము, దేశభక్తి, కార్యశూరత్వము మొదలగు సద్గుణరాజినలవరచి, వారి నైతిక జీవితము సాధ్యమగునంతవరకు తద్గుణముల కనుకూలముగ నొనర్చి, వారి నాదర్శ భావి పౌరులుగ నొనర్చుట.

స్థానికచరిత్రము - దేశ చరిత్రము —

చరిత్ర రెండు విధములు. (1) స్థానిక చరిత్రము, (2) దేశచరిత్రము—స్థానిక చరిత్ర యనగా ప్రత్యేకముగ నొక స్థలమునకు సంబంధించిన చరిత్రము. దేశమునకు లేక జాతికిసంబంధించినచరిత్ర దేశచరిత్ర లేక జాతీయచరిత్ర యనబడును. ప్రప్రథమమున చరిత్రాభ్యాసము స్థానిక చరిత్రముతో ప్రారంభమగుచో దేశ చరిత్రను గతానుగతికముగా బోధించుట సులభమగును. ఇంట గెలిచికదా రచ్చ గెలుపు ? తెలిసినదానినూతగా గైకొని తెలియని దానిని నేర్పుట కుపాధ్యాయుడు ప్రారంభింపవలయును. అందు చేతనే దేశచరిత్ర మొదలిడకముందు స్థానికస్థలము, మహాపురుషులనుగూర్చియు సంభాషణరూపమున, కథారూపముననను, వీలైనచో నాటకరూపముననను, ఆటపాటల రూపముననను ప్రదర్శించి విద్యార్థుల యాసక్తి నినుమడింపజేసి, వారిని భావి కార్యరంగమునకు బురికొల్పవలయును.

చరిత్ర (ప్రణాళిక) —

ప్రాథమికపాఠశాలలకు 1939 లో నూతనముగా నీయబడిన ప్రాథమిక విద్యా ప్రణాళికలో చరిత్రను మూడవతరగతి నుండి బోధించుటకు దగిన యవకాశము లీయబడినవి. వాస్తవముగ చారిత్రిక పారిభాషిక పదములు మొదటి తరగతి నుండియే ప్రారంభమగునని చెప్పనగును. మొదటి తరగతిలో గుణితము నేర్పునపుడు చారిత్రక నామములు, పారిభాషికపదములు, ఉపయోగింపవచ్చును. ఉదా॥ శిథిలహంపి, బౌద్ధమతము, అక్బరు; చంద్రనగర్ మొదలగునవి. ఇవియేగాక వాచకము చివరనుండు చిన్న కథలలో స్థానిక చరిత్రకు సంబంధించిన చిన్నచిన్న

కథలను చేర్చవచ్చును. ఇట్లు మొదటి తరగతిలోనే చరిత్రబోధనకు పునాది యేర్పడుచున్నది. రెండవ తరగతిలో స్థానికముగాగాని జాతీయముగాగాని, దేశీయముగాగాని, కథలను చేర్చుట పరిపాటియైనది. ఉదా॥ రామాయణము; మహాభారతము మొదలగునవి నేర్పనగును.

ఇక మూడవ తరగతిలో చిన్నచిన్న కథలతో చరిత్ర ప్రారంభమగుచునే యున్నది. స్థానికజాతీయ చరిత్రము లిందు మేళనమందియుండును. నాలుగవ తరగతి లోని చరిత్ర ప్రణాళికకొంచెము విస్తరింపబడి యున్నతముగనుండును. ఐదవ తరగతిలో ప్రాచీనాధునిక చారిత్రిక విషయము లన్నియు నలతులుగ కథారూపమున పొందుపరుపబడి కాలక్రమానుగతములగు తేదీలకిందు ప్రాముఖ్యమీయఁబడును.

గ్రంథస్థముగా విద్యార్థులు నేర్చుకొను విషయముల నాచరణరూపమున బ్రదర్శింపజేయుట యుపాధ్యాయులముఖ్యపరమావధియైయున్నది. ఇందు కుదాహరణప్రాయములుగ నుత్సాహకరములగు కొన్ని పద్ధతులీయబడినవి.

చరిత్రపాఠముల నాచరణరూపమున నుంచువిధము. ఉత్సాహకరములగు కొన్ని పద్ధతులు —

అవియేవన (1) చిత్రపటములను, చార్టులను, ప్రోగుచేసి చరిత్రకు సంబంధించిన ఆల్బములను తయారుచేయుట (2) కాలరేఖలు చిత్రించుట (3) వివిధరాజుల కాలమునాటి వస్తువులను ప్రోగుచేయుట (4) విహారములు (5) చారిత్రిక సంబంధములగు పద్యములు, పాటలు, నాటకములు (6) చారిత్రిక వివరణక్రియలు (Expression works) చేతిపనులు, చిత్రలేఖనము మొదలగునవి.

చిన్నతరగతులలోని విద్యార్థుల మనసు బహుసున్నితమైనది. దానికి నిశ్చలత్వము తక్కువ. అది నిరంతరమును చలించుచుండును కాన గ్రంథస్థవిషయములపై కేవలము వారికి విసుగుజనించి అనేక చారిత్రిక విషయముల సేవగింపు గలుగకుండుటకును మనసుద్వారా నేర్చుకొనిన విషయములు కర్మేంద్రియములద్వారా పైజెప్పబడిన వానిరూపమున నాచరణరూపకమున నుంచబడును. పైవానిలో ముఖ్యములైనవి 'చారిత్రిక చిత్రపటములను సేకరించుట.' ఇందుకొరకై యుపాధ్యాయుఁడు శక్తివంచనలేక ప్రయత్నింపవలయును. పటసహాయమునగాని విద్యార్థులకు చరిత్ర స్పష్టముగా అవగాహనముకాదు. 'విహారములు' గూడ విద్యార్థుల విజ్ఞానము నాచరణరూపమున నుంచుటలోను కార్యోత్సాహము నినుమడింపజేయుటలోను, దోహదమొసంగును. 'కాలరేఖలు' గీయుటవలన చారిత్రక కాలపరిమితులు బాగుగా వారి మనస్సుల కెక్కును.

ముఖ్యముగా చారిత్రక పద్యములు, పాటలు, నాటకములు, విద్యార్థుల మనముల నెరతయు రంజింపజేయునవై యున్నవి. మూడు నాల్గు ఐదు తరగతుల లోని బాలబాలికల నిందు బాల్గొనజేసి వారి నుత్సాహవంతులుగ నొనర్పవలయును. మచ్చునకు పద్మినీ, రాణీదుర్గావతి, పల్నాటి చరిత్రము, కృష్ణదేవరాయలు మొదలగునవి నాటకరూపమున బ్రదర్శించుటకు వీలుగా సులభముగనుండును.

పై జెప్పఁబడిన వానిద్వారా త్వరిత

చలితములగు విద్యార్థుల మనములను క్రమ క్రమముగా వశపరచుకొని యుపాధ్యాయుఁడు వారికి చారిత్రక పరనాసక్తిగలుగఁజేసి వారి పురోభివృద్ధికి తోడ్పడునుగాక!

---

## గుడివాడ తాలూకా బోర్డు ప్రాథమికోపాధ్యాయ సమావేశము

కార్యవర్గము వారి అభివృద్ధి నిరోధకపంథా

16-10-43 న గుడివాడలో కృష్ణాజిల్లా యుద్ధ కమిటీ సభ్యులు, గుడివాడతాలూకా యుద్ధకమిటీ కార్యదర్శులును, స్థానిక న్యాయవాద ప్రముఖులలో ఒకరును అగు శ్రీ అట్లూరి ధర్మారావు చౌదరి బి. ఏ, బి. యల్, గారి ఆధిపత్యమున సమావేశమాయెను.

ప్రభుత్వమువారు ప్రస్తుతము సాదరుచేసిన **War Defence Savings Bonds** ప్రతి బోర్డు ప్రాథమికోపాధ్యాయుడు 50 రూపాయిలకు తక్కువగాని విలువకు కొనుటకు ఈ మహాసభవారు ఇచ్ఛగించుచు ఏకగ్రీవముగా తీర్మానించుచున్నారు. అను తీర్మానమును చర్చకు తెచ్చి కడకు నెగ్గించియున్నారు.

యథార్థమే ఈ సంగ్రామకాలములో ప్రభుత్వమునకు ధనరూపముననే కాక, సాధ్యమైనన్ని ఇతర విషయములుగా కూడ సాయముచేయుచు, కష్టములకైనాసరేలోనై, ఫాసిస్టురాక్షసులు మన మాతృదేశమున పాదమిడకుండుటకును, సత్వరమిత్రరాజ్య జయమునకును పూర్తిసాయముచేయుట ప్రతి భారతీయుని విధి.

ఈవరకుకూడ ప్రభుత్వమువారి లాటరీ టిక్కెట్ల అమ్మకములోను ఇతరవిధములుగాను కూడ బోర్డు ప్రాథమికోపాధ్యాయులందరు శక్తికిమించిన సాయముచేసి యున్నారు. కాని ప్రభుత్వము ప్రభుత్వేతర పాలకవర్గముకూడ ప్రాథమికోపాధ్యాయులను బహు నీరసముగాను, నిర్లక్ష్యముగాను చూచుచు ఎన్నో విధాల అభివృద్ధి నిరోధకమార్గాలనుకూడ ఘటిల్ల జేయుచున్నారు. ఎంతటి నిరుత్సాహకార్యములు సంఘటిల్లినా ప్రాథమికోపాధ్యాయుల లక్ష్యము మాత్రము ఏమీ మార్పుచెందలేదు.

యుద్ధము ఆరంభమైననాటినుండి నేటివరకు జీవితావసరమైన ఆహారపదార్థాలు మొదలు, ప్రజలదైనికావసరాలకు వినియోగించు ప్రతివస్తువూ, రెండు - మూడు, కొన్ని ఐదురెట్లుగా కూడ ఖరీదులు పెరిగిపోయి, జీవితమే కష్టముగావున్నదని గ్రహించి ప్రభుత్వమువారు తమసిబ్బంది జీవిత సౌలభ్యముకొరకు కరువుబత్తెములను (**Dearness allowances**) ఏర్పరచి ప్రజలయొక్క సద్భావాన్ని పొందుతున్నారు.

ఆవిధముగా ప్రభుత్వము - ప్రభుత్వేతర పాలక సంఘములు కూడ ప్రభుత్వమువారిచే నిర్ణయింపబడిన కరువుబత్తెములను ఇచ్చి సాయపడుతూ వచ్చాయి. కృష్ణాజిల్లాబోర్డువారు గవర్నమెంటు నిర్ణయించిన కరువుబత్తెములను ఆఫీసుప్యూనులగాయితు - ఉన్నతాధికారివరకు అమలుజరుపుతుంటూ వచ్చారు కాని ప్రాథమికోపాధ్యాయులకు కూడ యిచ్చాము అని పించుకోవడానికి మాత్రము మహాసముద్రములో నీటిబొట్టువలె 1942 వ. సం. నవంబరునుండి నెలకు తలకు ఒక్క రూపాయిచొప్పున ఇస్తున్నారు. ఏవిధముగా ఆలోచించినా అతిస్వల్ప జీతములమీద ఆధారపడియున్న ప్రాథమికోపాధ్యాయునికి యిచ్చుచున్న ఒక్కరూపాయి కరువుబత్తెము చెప్పుకోదగిన స్థితిలో లేదు. ప్రభుత్వమువారిచే నడుపబడుచున్న పాఠశాలలలోను - లేబరు పాఠశాలలలోనుకూడ, హెచ్చుజీతములేకాక ప్రతిఉపాధ్యాయునకు నెలకు రూ 6-8-0 కరువుబత్తెములు ఇచ్చుచుండ, ఇటు కృష్ణాజిల్లాబోర్డు ప్రాథమికోపాధ్యాయులకు మాత్రము నెలకు, తలకు ఒక్కరూపాయి! ఈ భేదమెందుకో.

ఈక్లిష్ట పరిస్థితులలో ప్రాథమికోపాధ్యాయులు పొందుచున్నకష్టములు వర్ణనాతీతములు. దైనికాహారములోకూడ ఎన్నోప్రధానవస్తువులను మినహాయింపు చేసుకుంటు - శరీరాచ్ఛాదనకు పూర్తిబట్టలేకుండాను ఏదోవిధముగా జీవయాత్రను సాగిస్తున్నారంటే అతిశయోక్తికాదు.

ప్రాథమికపాఠశాలలను మినహాయిస్తే, ఉన్నత పాఠశాలలులేవు, కళాశాలలులేవు దేశముయొక్క సౌభాగ్యమేలేదు. భారతీయుల నిరక్షరాస్యత నిర్మూలనకు, విజ్ఞానప్రచారానికి, భావిభారతభాగ్య శుభోదయానికి ప్రాతిపదికలైన ప్రాథమిక పాఠశాలలను, తదుపాధ్యాయులను నిర్లక్ష్యముగావించి కష్టములకు గురిచేయుట దేశాన్ని వినాశమార్గాన పట్టించుటయే.

### కార్యవర్గమువారి వింతపోకడ.

ఇన్నివిధాలుగా బాధలనందుచు జీవయాత్ర చేయుచున్న ప్రాథమికోపాధ్యాయులకు అశనిపాతమువంటిది పైతీర్మానము. 'దున్నబోతే దూడల్లో-మేయబోతే ఎడ్లల్లో' అన్నది వాడుకసామెత. అదే ప్రాథమికోపాధ్యాయుల స్థితిలో మాత్రము తలక్రిందులై 'దున్నబోతే ఎడ్లల్లో - మేయబోతే దూడల్లో' అన్నట్లు సార్థకమైంది.

తన పుత్రము కానప్పుడు తాటిపట్టకైనా ఎదురేనన్నట్లు పై తీర్మానచర్చా సందర్భములో ఈతీర్మానమును నెగ్గించవలసిందే అను అధ్యక్షులవారి 'హుషార్' వచనాలు కార్యవర్గ అధ్యక్షులుకూడ, తీర్మానమును బోర్డుఆఫీసునుండి తెచ్చాను. ఇందుకు భిన్నముగా పలికినవారిపై పాలకవర్గమువారికి రిపోర్టు చేయబడునను బెదరింపువచనాలు- పై మొత్తమును, నిర్బంధముగానైనా తీసుకుంటారు గనుక మనమే తీర్మానము చేయుట శ్రేయస్కరమనుకొందురు. కార్యవర్గసభ్యుల నిరుత్సాహవచనాలు—తమ్ముంగల అధికారుల పరాకువచనాలు చూడ, ఇందు కొంత అంతర్నాటకమున్నదని తప్పక అనుమానము కలుగుచున్నది. ఎవరికి వారు పై అధికారుల మెప్పును పొందు నుద్దేశ్యముతో, ఇట్టి కపటనాటకములాడి తుదకు తీర్మానమును నెగ్గించుకున్నారు.

ఈ తీర్మానమును అసలే చేయవద్దనిగాని, ప్రభుత్వానికి సాయపడవద్దనిగాని, నా అభిప్రాయము కాదు. కేవలము 15, 18 రూపాయిల మాసిక వేతనముమీద ఆధారపడి, ఆలుబిడ్డలు-తల్లిదండ్రులు ఆదిగాగల కుటుంబమును ఈదుకుంటూ, పగలు తలెత్తుక తిరగటానికి రాత్రి హాయిగా నిద్రపోవడానికి గాని, నోచుకోని ప్రాథమికోపాధ్యాయునికి చచ్చేముందు సంధిమంత్రమన్నట్లుగావుంది ఈ తీర్మానము. శక్తి అశక్తతలను పాటించక సాముదాయక జరిమానావలె తలకు 50-0-0 రూపాయిలు ఇచ్చునట్లు తీర్మానముగావించుట మూలిగే నక్కమీద తాటికాయ అన్నట్లు బహువిధాలుగా బాధాకరము.

కరువుబత్తెములు, కిరసనాయిల్, తెల్లకాగితాలను, సాధించేవిషయంలో తగినంత ఆందోళనచేసి కార్యసానుకూలము చేయలేకపోయిన కార్యవర్గము వారు ఉపాధ్యాయలోకముయొక్క అవసరములను గమనించి వీరు గావించు ఆందోళన కార్యరూపము పొందుటకు వలయు, చేయగలసాయమును కూడ, చెయని అధికారవర్గమువారు కూడ, ఈనాడు తగుదుమమ్మాయంటు, పై తీర్మానమును నెగ్గునటులచేసి ఉపాధ్యాయలోకమును పసిడిసంకెళ్లతో బంధించుటయేకాక, తమ్ముంగల ప్రాథమికోపాధ్యాయ సంఘములకు కూడ మార్గదర్శకులైనారు. స్వల్పమైన స్వార్థమునకు అధికార ప్రాబల్యము నపేక్షించి, సంఘమును అక్రమపంథాను నడిపించుట ఆత్మద్రోహము, వినాశహేతువు. ఎట్టకేలకు ప్రాథమికోపాధ్యాయుల జీవితసమస్యనే పణముగా ఒడ్డి పై తీర్మానమును గావించుటలో కృతకృత్యులైన కార్యవర్గమువారికి తమ్ముంగలారికికూడ నాజోహారు.

"ఒక ఉపాధ్యాయుడు"

[గమనింపు—ఈ వ్యాసమునకు సంబంధించిన అన్నివిషయాలకు వ్యాసకర్తలే సంపూర్తిగా బాధ్యులైయున్నారు. ఇందువిషయమై యీపత్రికకు గాని, పత్రికాధిపతులకుగాని, సంపాదకులకు గాని, యేలాటి బాధ్యతయు, సంబంధమును లేదని హెచ్చరిక.]

---

## విద్యా ప్రచారపుపాట

బాలకవి ఏ. వి. రాఘవయ్య

(చల్ చల్ రె నౌ జవాన్ వరుస)

రమ్ము బాలకా! రా రమ్ము బాలకా
బడిని జేరి చదువు కొనగ ॥రమ్ము బాలకా॥

1. సర్వ శ్రేష్ఠమౌ దేశంబు నందున
క్రారుకొనియెను అజ్ఞాన తిమిరము
జ్ఞాన దీపికలను జూపి దరికి జేర్చగా ॥రమ్ము బాలకా.

2. పరదేశమందునా బంధువులపోలిక
వాంచితార్థదాయి పరమాత్మ భంగిని
ఎల్లయెడల తోడునీడయగుచునుండుగా ॥రారమ్మ సోదరా॥
స్వాతంత్ర్య జీవన సమస్యలందున
దాస్యశృంఖలములనెల్ల తలగజేసెడి
మార్గమె యీ విద్యయని మదినెంచుమా ॥రమ్మ సోదరా॥



---

## వి ద్యా ప్ర చా ర గీ త ము

(పో ష కు ల కు)

రచయిత కే. జేకబ్, టీచరు-లేబరుస్కూలు, లేపాక్షి, అనంతపురంజిల్లా.

(చాయ —"రైతుకే ఓటివ్వ వలెనన్న")

1. విద్యయందు వెనుక బడకండి - మీబిడ్డలందు
శ్రద్ధ గలిగి బడికి బంపండి
విద్యలేని పిల్లలంత - వ్యర్థముగ చెడిపోదురండి
ముద్దుబిడ్డలు మూఢులై బహు - మొద్దులై చెడిపోవకుండ॥ విద్య॥
2 చదువు సంధ్యలులేని యూళ్ళన్న - మనపల్లె కొంపలు
దమ్మిడీకి పనికిరావన్న
చదువు సంధ్యలు లేక మనము - మూఢులై చెడిపోవు చుంటిమి
చదువు నేర్చిన జాల సులభము - ఎల్లకార్యము లెఱిగితీర్పను॥ విద్య॥
3. విద్యమహిమను దెలిసికొనరన్న - మన మందరమునూ
విద్యలేని పశువు జనమన్న
విద్యనేర్చిన దేశరక్షణ - జేయగలమవి దెలిసికొనుడి
నేటికైనను నిదుర మేల్కొని - మేటివిద్యను నేర్వమీరు॥ విద్య॥
4. ముందు స్థానము విద్యదేనన్న - నిదురించకను మీ
రందు పాల్గొన సిద్ధపడరన్న
ముందు జీవనమందు మన మా - నందపడగల విధము దెలుప
మందమతి వెడలించి మనకా - ముందు జీవన మందనేర్పెడి
5. వినయమున్నది విద్యవలనన్న - వినయంబుతోను
ధనము సుఖము లభింపగలదన్న
విద్యలేని మానవుండు - వింతపశువుగ నెన్నబడును
విద్యనేర్చగ దేశమున నైక్యంబుతోడను మెలగనేర్పెడి॥ విద్య॥



---

# సభలు - తీర్మానములు

వీరంకిలాకు —గన్నవరం తాలూకా ఎయిడెడ్ ఎలిమెంటరీ టీచరు-మేనేజర్ల సంఘసమావేశము ది 24-10-43 తేదీ ఆదివారం మధ్యాహ్నము సుమారు 2 గంటలకు వీరంకిలాకుయొద్ద శ్రీ కూచి వెంకట సుబ్బారావుయొక్క హిందూ ఎలిమెంటరీ పాఠశాలాభవనములో మ॥ రా॥ శ్రీ దెందులూరి లక్ష్మీనారాణ గారి అధిపత్యమున సమావేశమై యీ క్రింది తీర్మానములు యేకగ్రీవముగా నామోదింపబడెను

(1) ఉపాధ్యాయులకు కరవుభత్యము లభివృద్ధిచేయుట.

(2) లోకల్ కండిషన్సు ననుసరించి పాఠశాలలకు యింటిఅద్దెలను మంజూరుచేయుట.

(3) ఉపాధ్యాయుల నిష్పత్తి 2-1 బదులుగా 1-1 ఉపాధ్యాయులు పనిచేయుటకు అనుమతి నిచ్చుట.

(4) ట్రయినింగుకాని టీచరు-మేనేజర్లకు పర్మనెంటు యొగ్జెంప్షను అంగీకరించుట.

(5) అర్హతగల హయ్యర్ ఎలిమెంటరీ పాఠశాలలకుకూడ 50% బోనస్సు గ్రాంటుమంజూరుచేయుట

(6) స్కూలుఫైనల్ పరీక్ష ప్యాసైన హయ్యరుగ్రేడు ఉపాధ్యాయులు సెకండరీగ్రేడు T.S L.C పరీక్షకు కూర్చొనుటకు అనుమతినొసంగుట.

(7) జిల్లావిద్యాశాఖాధికారులు కోరిన allotment మొత్తము పూర్తిగానిచ్చుట.

(8) E S.L C. పరీక్షకు హైస్కూలుమందిని ఎలిమెంటరీ పాఠశాలలో పనిచేయు సెకండరీ గ్రేడు ఉపాధ్యాయుల నెన్నుకొనుట

(9) ప్రస్తుత అమలులోనున్న విద్యాప్రణాళికలోని కొంతభాగము తగ్గించుట.

(10) అధికయుద్ధపత్రములు కొనవలసినదిగా టీచరు-మేనేజర్లను వత్తిడిచేయకుండుట.

(11) ఈ తీర్మానములు శ్రీకృష్ణాజిల్లా విద్యాశాఖాధికారిగారి యొద్దకుగొనిపోవుటకు రాయబార సభ్యులను ఎన్నుకొనుట.

G. LAKSHMEENARAYANA, President.

కె. వి. సుబ్బారావు, సెక్రటరీ.

శ్రీరామచంద్రపురం తాలూకా టీచరు మేనేజర్ల సంఘము ది 16-9-43 గురువారం మండపేటలో శ్రీ జి. వి నరసింహాచార్యులుగారి ఆధిపత్యమున జరిగిన 2 వ స్థాయీ సంఘసభా తీర్మానములు.

I. ప్రభుత్వమువారికి కలుగుచున్న విజయములకు తమసంతోషమును వెలిబుచ్చుచు, మిత్రమండలికి శాశ్వత విజయము కలుగుగాక! II డి. ఇ. ఒ గారి పర్సనలు, అసిస్టెంటు శ్రీ R. J. గిడ్డిగారి అకాల మరణమునకు సంతాపము వెలిబుచ్చుచూ, వారిఆత్మశాంతి నొసంగ భగవంతుని ప్రార్థించుచున్నారు. III ఈసంవత్సరము Aided సంస్థకు 5 లక్షలదనముగా నిచ్చినందుకు శ్రీగవర్నమెంటువారికిని అందుకై విశేష కృషిసల్పిన శ్రీ. D. P. I గారికిని కృతజ్ఞత వెలిబుచ్చుచున్నారము IV ఏజన్సీ ప్రాంతములలో యిచ్చుచున్న స్కేల్లనే (Aided schoolsకు) యిచ్చుట (Aided schoolsకు) కూడ యిప్పించగలందులకు ప్రభుత్వమువారినే కోరుచుటకును V ప్రభుత్వ సిబ్బందికిచ్చురేట్ల ప్రకారము యైడెడ్ టీచర్లకుకూడ యుద్ధభత్యము ఇప్పించ ప్రభుత్వమువారిని కోరుటకును VI నెలవారీగ్రాంట్లు యిప్పించకోరుటకును VII నేటివరకుగల సంఘజమాఖర్చు 3-15-6 నిల్వతో అంగీకరించుటకును VIII ఏడిద సీతానగరం హిందూ యెయిడెడ్ స్కూలు మేనేజరు శ్రీ జి.వి, నరసింహాచార్యులుగారినే సంఘాధ్యక్షులుగా ఎన్నుకొనుటకును, IX బడితోటలలో అధికాహారమును పండించుటకును, దీనినే గ్రామస్థులకు బోధించుటకు, యుద్ధఋణ పత్రములు కొనుటకు, యుద్ధమునకు అన్నివిధముల సహాయము చేయ ప్రజలలో ప్రబోధించ యీ సంఘ సభ్యులకు సలహాయిచ్చుటకు X ప్రతియెడెడ్ టీచరు 1 కి 2 శేర్లును, ఈసంఘమునకు 4 శేర్లును కిరస నాయిలు ప్రతినెల సప్లైచేయించ శ్రీ కలక్టరువారిని కోరుటకు తీర్మానించడమైనది.

Y. Kameswara Rao, Secretary.

G V Narasımhacharyulu, President. Yedıdha.

18—IX—43.

## శ్రీరామచంద్రపురం తాలూకా టీచరు మేనేజర్ల సంఘము, కార్యస్థానము, ఏడిద.

L Dis No 5/43 Date 6—10—43.

## తృతీయ స్థాయీ సంఘ సభాహ్వానము

ఈ సంఘ తృతీయస్థాయీ సంఘసమావేశమున ది 15-10-43 శుక్రవారం మాచవరం యైడెడ్ ఆది ఆంధ్ర స్కూలులో మధ్యాహ్నం గ॥ 2 లకు సంఘాధ్యక్షులగు శ్రీ G. V. నరసింహాచార్యులు గారి ఆధిపత్యమున జరుగును. కావున స్థాయీసంఘ సభ్యులు సాధారణసభ్యులు తప్పక విచ్చేయ ప్రార్థితులు.

ఈ దిగువ విషయములు విరివిగా ఎల్లరకు (సభ్యులకు) తెలుపగలందులకై మిమ్ము కోరుచున్నాను.

(1) గ్రాంటుబిల్లు మార్చుకొనుటకు మేనేజరు వెళ్ళలేనప్పుడు మరొక నమ్మకస్తునకు సొమ్ము నియ్యమని వేరేఉత్తరము ట్రజరీ ఆఫీసరుగారి కియ్యవలెను. దానిని గౌరవించి సొమ్ము యీయబడును.

(2) ప్రాతపద్ధతిలో హయ్యరుగ్రేడు పరీక్షతప్పినవారు మరల 1943 సం॥రం మార్చి 13 వ తేదీని ప్రారంభమగు హయ్యరుగ్రేడు పరీక్షకు ప్రాతపద్ధతిలోనే వెళ్ళవచ్చును. పరీక్ష రుసుము రు 3-0-0 లును ది 15-10-43 లోగా చెల్లించవలెను. 1943 సం॥ము పరీక్షలో తప్పినవారు ఏసబ్జక్టులలో పోయినదియు ది 14-9-43 వ తేదీ గెజెటులో గలదు. కాన చూచుకొని వలయుశ్రద్ధగైకొనవలయును. లెట్సుబుక్సు నిరిటివే.

వై. కామేశ్వరరావు
కార్యదర్శి.

## భీమవరము తాలూకా ఎయిడెడ్ టీచర్సు యూనియను

ఈ సంఘముయొక్క 4 వ సమావేశము శ్రీ డి. వి. సుబ్బారావుగారి ఆధిపత్యమున ది 7-8-43 తేదీని భీమవరం బోర్డు బాలుర ప్రాథమికపాఠశాల భవనమునందు సమావేశము అయి యీ దిగువ తీర్మానములు గావింపబడెను.

1. యీ తేదీవరకు జమాఖర్చులు సరిచూడడమైనది. ఖర్చులు అంగీకరించబడెను. జమ రొఖ్ఖం రు. 0-2-0 లు, ఖర్చురొఖ్ఖం రు. 4-15-9 లు మిగిలినది శక్రటరీగారిచేతిడబ్బు.

2. 14-8-43 తేదీని 12 గం to 5 గంటలవర్కు భీమవరం తాలూకాబోర్డు ప్రాథమిక టీచర్సు యూనియన్‌దారు వారియొక్క తాలూకామహాజనసభ శ్రీ డి. యి. ఓ. గారి ఆధిపత్యమున భీమవరం హైస్కూలు భవనమునందు జరుపుటకు నిశ్చయించుకొన్నారు. కావున మన ఎయిడెడ్ టీచర్సు యూనియన్ సమావేశము సదరు కాలమునందు సదరు స్థలమునందే వారితోపాటు జరుపుటకు తీర్మానించడమైనది.

3. ఒకపాఠశాలనుండి మరియొకపాఠశాలకు పోయిన వారిని వేస్టేజీగా పరిగణింపకుండా చూడ గలందులకు శ్రీ డైరక్టరు దొరవార్ని కోరడమయినది.

4. ఒకటవ తరగతిలో చేరినవారిని ఐదవ తరగతి వరకు అయిన మానకుండా చదువులాగున ప్రవేశ దరఖాస్తులలో తలిదండ్రులచేత వాగ్దానము చేయించులాగున ఏర్పాటుచేయించగలందులకు శ్రీ డైరక్టరు దొరవారిని కోరుచు తీర్మానించడమయినది.

5. యిప్పటికి మూడు మీటింగులకు హాజరుకాని మెంబర్లను వారి వారి స్థానములయందు తిరిగి ఎన్నికలు జరిపించగలందులకు తీర్మానించడమయినది.

6. 14-8-43 తేదీని జరుగు మహాసభయందు ప్రతికార్య నిర్వాహకవర్గసభ్యుడును ప్రతి ఉపాధ్యాయునివద్దనుంచి యూనియను సభ్యత రుసుమును ఒక్కొక్కనికి 0-2-0 చొప్పున తప్పకవసూలు చేయును. అట్లు 0-2-0 లు రుసుము యిచ్చినవారికే యూనియన్ సభ్యులుగానుండుటకు హక్కుగలదు.

7. ఆ దినమున శలవుదినముగా (14-8-43 తేదీ) పరిగణింపగలందులకు శ్రీ డిపార్టుమెంటువారిని కోరడమైనది.

8. కాన్ఫరెన్సు కార్యక్రమము జరుపుటకు ఏర్పాటుచేయుటకుగాను శ్రీ ప్రెశిడెంటు, శ్రీ శక్రటరి శ్రీ యన్. సుందరరావుగార్లకు అధికారమివ్వడమయినది.

షరా — శ్రీ డి. యి. ఓ. గారు ప్రసిడెంటుగా యుండుటకు అంగీకరించనందున 14-8-43 తేదీని తాలూకా కాన్ఫరెన్సు జరిగియుండలేదు.

వీరవాసరం, }
5—11—43. }

ఇట్లు,
సి. హెచ్. శ్రీరామమూర్తి.
కార్యదర్శి
ఎయిడెడ్ టీచర్సు, భీమవరం తా||

## భీమవరం తాలూకా ఎయిడెడ్ టీచర్సుయూనియన్.

ది 23-10-43 తేదీని 2 గంటలకు యీ సంఘముయొక్క 5 వ సమావేశము శ్రీ ఎ. మార్కుగారి ఆధిపత్యమున భీమవరం శ్రీరఘురామాహిందూ ఎయిడెడ్ పాఠశాల భవనమునందు జరుపబడి యీ దిగువ తీర్మానములు గావింపబడెను.

1. ప్రస్తుత ప్రపంచసంగ్రామమునందు మిత్రమండలివారికి జయముచేకూర్చుగాకయని భగవంతుని గూర్చి ప్రార్థించుచు యీ సభవారు తీర్మానించడమైనది.

2. శ్రీ వెంకటరామాఅండుకో ప్రొప్రైటరుగారైన ఈదర వెంకట్రావుపంతులుగారు యీ సంఘమునకు 5-0-0 లు విరాళముక్రింద యిచ్చినందుకు వారికి భగవంతుడు ఆయురారోగ్యములు ఒసంగు గాతయని ప్రార్థించుచు వారికి సంఘమువారు అభివందనములు అర్పించిరి.

3. యీ తేదీవరకు జమాఖర్చులు సరిచూడడమైనది. జమరొఖము మొత్తం రూ 60-12-0 లు ఖర్చులు రూ 8-14-3 పోను మిగిలిననిల్వ రూ 51-13-3 లు అంగీకరించడమైనది.

4. జిల్లాఎయిడెడ్ టీచర్సు యూనియనుకు యీ తాలూకానుండి వారు పంపించమనికోరిన ప్రకారం యీతాలూకా ఎయిడెడ్ టీచర్సువద్దనుండి వసూలయినడబ్బులో నాల్గవవంతు పంపుటకు శ్రీ శక్రటరీ గారికి అధికారము యివ్వడమైనది.

5. శ్రీ శక్రటరీగారుగాని తదితరమెంబర్లుగాని అనగా స్థాయిసంఘ సభ్యులుగాని, తాలూకా లోని యితరశెంటర్లకువెళ్ళి యూనియన్ సభ్యులుగాచేర్చి చందా ధనము వసూలుచేయుటకునుగాని యీ యూనియన్ యుద్దేశ్యములు బోధించుటకుగాని వెళ్ళినందుకు రాకపోకలఖర్చులు యీ యూనియను అంగీకరించి యిచ్చుటకుగాను తీర్మానించడమైనది.

6. యీతాలూకాయొక్క మహాజనసభజరిగించుటకుగాను శ్రీ శక్రటరీగారైన సి. హెచ్. శ్రీరామమూర్తిగారికి సర్వాధికారము యివ్వడమైనది.

7. యీ తాలూకాయొక్క మహాజనసభకు శ్రీ. డి. యి. ఓ. గార్ని అధ్యక్షులుగా యుండుటకు అంగీకరించగలందులకు శ్రీ. డి. యి. ఓ. గార్ని కోరడమైనది. సదరుదినము శలవుదినముగా పరిగణింప గలందులకు శ్రీ డిపార్టుమెంటువార్ని కోరడమైనది.

8. ఎయిడెడ్ పాఠశాలయందలి ఉపాధ్యాయులకు ఒకపూట అనగా ½ day క్యాజువల్ ఉపయోగించుటకు అనుమతి యిప్పించగలందులకు శ్రీ డిపార్టుమెంటువార్ని కోరడమైనది.

9. శ్రీ ఎ. రామమూర్తిగారు యిచ్చిన పిటీషను చర్చించుటకుగాను సదరు పిటీషను భీమవరం శంటరునకు పంపించగలందులకు తీర్మానించడమైనది.

10. ఎయిడెడ్ ఉపాధ్యాయులకు ఉపాధ్యాయుని ఒకటికి 4 శేర్లు కిరసనాయిలు యిప్పించగలందులకు శ్రీ డి. యి. ఓ. గారి ద్వారా శ్రీ జిల్లాకలెక్టరుదొరవార్ని కోరడమైనది.

11. శ్రీ శంకర లక్ష్మీపతిగార్ని యూనియన్ బిల్డింగునకు స్థలము ఉచితముగా యిప్పించగలందులకు కోరుటకు యీదినమున వార్ని యీ కమిటీవారు వార్ని దర్శించుటకు వెళ్లుటకు తీర్మానించడమైనది.

12. కోలమూరు శంటరునుండి యింతవర్కు 1943 to 44 సం॥లకు మెంబర్లు ఎన్నికలురానందున సదరు శంటరునందు ఎన్నికలు జరిగించుటకుగాను 1943 to 44 సం॥లకు సభ్యత రుసుములు సదరు శంటరునందు టీచరు 1కి రూ. 0-2-0 లు చొప్పున వసూలు చేయుటకుగాను శ్రీ జి. సామేలుగారు (జాయింటు శక్రటరీగార్ని) యూనియను ఖర్చులమీద వెళ్లుటకుగాను తీర్మానించడమైనది.

13. తిరిగి యీ సంఘముయొక్క 6 వ సమావేశము భీమవరం రెష్టుహౌసురోడ్డు పాఠశాల భవనమునందు ది. 20-11-43 తేదీని 2 గంటలకు జరుపుటకు తీర్మానించడమైనది.

ఇట్లు,
CH. SREERAMAMURTY.
కార్యదర్శి
ఎయిడెడ్ టీచర్సు యూనియన్, భీమవరం తాలూకా.

వీరవాసరం,
5—11—43.

ది 20—10—43 తేదీరాత్రి 9 ఘంటలకు బ్రాహ్మణగూడెం గ్రామంలో హిందూఎయిడెడ్ ఎలిమెంటరీ పాఠశాలయొక్క తల్లిదండ్రుల సమావేశము కొవ్వూరు రేంజి స్కూల్ల డిప్యూటీయినస్పెక్టరుగారైన మ॥ రా॥ శ్రీ గుండిమెడసూర్యనారాయణగారి ఆధిపత్యమున జరిగెను. సభకు సుమారు 200 మంది వచ్చిరి. తల్లితండ్రుల సంఘము స్థాపించి ఆ సంఘమునకు మ॥ రా॥ శ్రీ మానాప్రెగడ వెంకటరత్నంగారిని ప్రసిడెంటుగాను, శ్రీ దేవరభొట్ల వెంకటేశ్వర్లుగారిని కార్యదర్శిగాను యెన్నుకొనిరి. శ్రీ డిప్యూటీయినస్పెక్టరుగారు తల్లిదండ్రుల సంఘముయొక్క ఆవశ్యకతనుగూర్చియు, గ్రామములో లైబ్రరీలనుగురించియు ఉపన్యసించిరి. గ్రామములో నిరుద్యోగులను వార్ సెక్షీషియన్సుగా చేరవలసినదిగా హెచ్చరించిరి. సుమారు 11 ఘంటలకు సభముగిసెను.

దేవరభొట్ల వెంకటేశ్వర్లు
శక్రటరీ, 4-11-43

## నర్సాపురం తాలూకా బోర్డు ఎలిమెంటరీస్కూలు టీచర్సు యూనియన్

ఈ యూనియన్‌యొక్క చతుర్వార్షికోత్సవము ది 27-11-1943 మధ్యాహ్నము 2 గంటలకు నర్సాపురములోని బోర్డు ఉన్నతబాలికాపాఠశాలయందు (జమీందారుగారి మేడలో) శ్రీ డివిజినల్ యినస్పెక్టరుఆఫ్ స్కూల్సు గుంటూరు డివిజన్‌వారి అధ్యక్షతను జరుపబడును. శ్రీ యినస్పెక్ట్రెస్ ఆఫ్ గరల్సస్కూల్సు ఫస్టుసర్కిల్ వారు ఏతత్సభను తెరచుటకు దయతోనంగీకరించిరి.

ఆ దినముననే మధ్యాహ్నము 1 గంటకు శ్రీ యినస్పెక్ట్రెస్ ఆఫ్ గరల్‌స్కూల్సు ఫస్టు సర్కిల్ వారి అధ్యక్షతను జిల్లాబోర్డు స్త్రీ ఉపాధ్యాయుల మహాజనసభ జరుపబడును.

శిష్టా సూర్యనారాయణ,
కార్యదర్శి, 13-10-43

అనంతపురముజిల్లా, గుత్తితాలూకా, గడేకల్లుబోర్డు హిందూ కో ఎడ్యుకేషన్ స్కూలు నందు 20 & 21-10-43 తేదిలందు గుత్తిరేంజి స్కూళ్ళ డిప్యూటి ఇన్‌స్పెక్టరుగారగు శ్రీయుత కె. రామాశాస్త్రిగారు స్కూలు సాలుసరి పరీక్షజరిపిరి. మాపాఠశాలపిల్లలు అందరు అన్నిపాఠములందును తృప్తికరముగా వున్నారనియు, నానావిధములైన చేతిపనులు అందముగా చేయబడి చూచువారల కింపుగొల్పు

చున్నవనియు, బడియందు బాల, బాలికల సంఖ్య వృద్ధికరముగా వున్నందున 4 వ టీచర్‌ను వేయవలెననియు, ప్రకృతమందు ముగ్గురు ఉపాధ్యాయులు అనగా బి. వి. సంజీవరాయుడు. హెడ్‌మాష్టర్, అసిస్టాంటుటీచర్లు అగు యస్. యం. నాగలింగస్వామి, పి. శీతమ్మ మిస్ట్రెస్, వీరుకష్టపడి బడిపనులు తృప్తికరముగా చేయుచున్నారనియు, కనుక వీరిని ఇదే స్కూలునందు వుంచవలెననియు వ్రాసినారు.

(2) యుద్ధప్రచారము మరియు విద్యాప్రచారము విషయములు —

ఇందులో ప్రకృత యుద్ధపరిస్థితులను గురించి శ్రీయుత కె. రామశాస్త్రిగారి అధ్యక్షత క్రింద అనేక అంశములు వివరముగా తెలియజెప్పిరి. తదుపరి విద్యాప్రచారము వీరి సమక్షముముననే గ్రామము నందు చేయబడెను.

(3) బడిపిల్లలతల్లి దండ్రాదుల విద్యాపోషకసంఘము -

ఈసభ శ్రీయుత డి. ఐగారి అధ్యక్షత క్రింద ప్రార్ధనతో ప్రారంభించబడెను. ఇందుప గ్రామమందలి పెద్దలగు 1. శ్రీ. కె. విరుపాక్ష రెడ్డిగారు, 2. రెడ్డి. భీమరావుగారు, 3. కె. హంపరెడ్డిగారు, 4. కె. చిదంబరరెడ్డిగారు, 5. కె. పెద్దమల్లరెడ్డిగారు, 6. కె. రామప్పగారు 7. కె. క్రిష్ణారెడ్డిగారు, 8. కె. దొడ్డారెడ్డిగారు, 9. జి. తిమ్మారెడ్డిగారు. 10. ఏ. రామశేషయ్యగారు మొదలగు గ్రామమున పెద్దలందరును హాజరై యుండిరి. వీరందరును మాస్కూలును అన్నివిధముల వృద్ధిచేయించవలెననియు త్వరలో 4-వ టీచరును వేయునట్లు చేయవలెననియు అధ్యక్షులవారికి సమక్షమున తెల్పిరి. పిమ్మట మంగళముతో పైసభ ముగింపబడెను.

యస్. యం. నాగలింగస్వామి.
టీచరు - బోర్డుస్కూలు,
గడేకల్లు, (అనంతపురంజిల్లా.)

సర్వశిద్ధి తాలూకా యలమంచిలి సెంటరు ఉపాధ్యాయసంఘపు ప్రత్యేకసభ 3—10—43 తేదీని యలమంచిలి హైస్కూలు హెడ్మాష్టరుగారగు శ్రీ ఏ. ఎల్. నారాయణరావు పంతులుగారు ఏం.ఏ, ఎల్.టి, వారి అధ్యక్షత క్రింద జయప్రదముగ జరిగెను.

ఈ రేంజి సీనియరు డిప్యూటీయినస్పెక్టరువారగు శ్రీ ఎ. సుబ్బారావు పంతులుగారు ఎం.ఏ, ఎల్.టి, వారి శలవుసందర్భమున క్రొత్తగావిచ్చేసిన డిప్యూటీయినస్పెక్టరు వారగు శ్రీ డి. రామమూర్తిగారు బి. ఏ. బి. ఇడి. వారికి సన్మానపత్రమను శ్రీ సుబ్బారావు పంతులుగారికి వీడ్కోలు పత్రమును నొసంగబడి యీ సెంటరు ఉపాధ్యాయుల కృతజ్ఞతావందనము లర్పించబడెను.

యం. సుబ్బారావు
కార్యదర్శి, యలమంచిలి.

---